


# మాతా పుత్రికల జ్ఞాన చర్చ





హిందీ మూలం :

డా. శ్రీరామ ఆర్య





సంపాదకుడు :

సుమూర్తి

(డా॥ కోడూరి సుబ్బారావు)

అనువాదకుడు :

కీ.శే. లోకా మల్లారి

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ




# మాతా పుత్రికల జ్ఞాన చర్చ

హిందీ మూలం :

**ఆచార్య డా. శ్రీరాం ఆర్య**

తెలుగు అనువాదం :

**పం. లోకామల్లారి**

సంపాదకత్వం :

**సుమ్మార్థి** (డా. కోదూరి సుబ్బారావు)

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

ఆర్యసమాజము-వ్యాస్‌నగర్, మేడిబావి, వారాసిగూడ,

సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల : 19
ప్రథమ ముద్రణ ప్రతులు : 2000
ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000

సృష్టిసంవత్సరము : 197, 29, 49, 113.
విక్రమాబ్దము : 2074.
కలియుగాబ్దము : 5113.
శ్రీ నందననామ సం॥ర శ్రావణ పౌర్ణిమ (2-8-2012)

**మూల్యము : రూ. 60=00.**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (P.O.) ; (Via.) **భువనగిరి** - 508 116.
సెల్ : 9290604641, 9908994084

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
కార్యదర్శి : శ్రీ కె.పి. నర్సింగ రావు. సెల్ : 98480 11073.

3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.

4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 040-6632 0300.

5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.

6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*
**PRINTSHOP** - 6632 0300.

# మాతా పితల దివ్యస్మృతిలో



కీ॥శే॥ శ్రీమతి గుండాల ఎల్లమ్మ గారు
మరణం : క్రీ.శ. 1992
(జీవితం 86 సం॥లు)



కీ॥శే॥ శ్రీ గుండాల చంద్రయ్యా గారు
మరణం : క్రీ.శ. 1969
(జీవితం 73 సం॥లు)

శ్రీ గుండాల చంద్రయ్యగారు పాత అల్వాల వాస్తవ్యులు. వీరి తండ్రి శ్రీ వెంకయ్యగారు. తల్లి శ్రీమతి రామమ్మగారు. వీరిది సామాన్య కుటుంబము. వీరికి 3వ సంతానంగా శ్రీ చంద్రయ్యగారు జన్మించిరి. సామాన్య కుటుంబంలో జన్మించి స్వయంకృషితో, సద్భావనతో భాగ్యవంతులైన సచ్చరిత్రులు శ్రీ చంద్రయ్యగారు. వీరికి శ్రీమతి ఎల్లమ్మగారితో వివాహమైనది. వీరి దాంపత్యము అన్యోన్యము ఆదర్శవంతము. వీరిది ఉదార స్వభావము. అందరితో కలిసిపోయెడి సాత్విక స్వభావము. వీరికి పిల్లలపై అత్యంత ప్రేమ, మమకారము యుండెడిది. వ్యవసాయం, పశుపోషణ వీరికి అభిరుచిగల విషయములు. వాటిని సమర్థవంతంగా, ఆదర్శంతంగా చేయుచుండెడివారు. గోవులపైన, గో సంతతి పైన వారికి అభిరుచి మెండు. వాటి యున్నతిపైననే మానవ జీవనము ఆధారపడి యున్నదని నమ్మెడివారు. వ్యవసాయము పశుపోషణతో బాటు వీరు క్రమంగా మిలిటరీ సివిల్ కంట్రాక్టులు చేయుచు స్వయంకృషితో ఆర్థిక పుష్టిని పొందిరి.

ఈ దంపతులకు ప్రథమ సంతానంగా ఒక కుమార్తె, తరువాత వరుసగా నలుగురు కుమారులు కలిగారు. కుమార్తెయైన శ్రీమతి కాంతమ్మ గారికి కూకట్‌పల్లి వాస్తవ్యులైన శ్రీ భీమరావుగారితో వివాహమయ్యింది. కుమారులలో పెద్దవారు శ్రీ రామారావు గారు. వీరికి శ్రీమతి కమలమ్మగారితోను, రెండవ కుమారుడైన శ్రీదామోదర రావు గారికి శ్రీమతి లక్ష్మి గారితోను, మూడవ కుమారుడైన శ్రీ శ్రీపతిరావు గారికి శ్రీమతి మంగమ్మగారితోను, నాల్గవ కుమారుడైన శ్రీ రఘుపతిరావు గారికి శ్రీమతి ఆనందబాయి గారితోను వివాహములైనవి. వీరిలో కుమార్తె శ్రీమతి కాంతమ్మగారు 86 సంవత్సరాలు జీవించి 25-1-2011వ తేదీన, రెండువ కుమారుడైన శ్రీ దామోదరరావు గారు 74 సంవత్సరాలు జీవించి 25-4-2012వ తేదీన

దివంగతులయ్యారు. ప్రస్తుతం జీవించియున్న ముగ్గురు కుమారులు వయస్సు మళ్ళినవారే. శ్రీ రామారావు గారి వయస్సు 80 సం॥, శ్రీ శ్రీపతిరావు గారి వయస్సు 69 సం.లు, శ్రీ రఘుపతిరావుగారి వయస్సు 66 సం॥లు. వీరంతా ఆరోగ్యంగా ఉత్సాహంగా పుత్ర పౌత్రాదులతో సుఖసంతోషాలతో ఆనందంగా ఉన్నారు.

పెద్ద కుమారుడైన శ్రీ రామారావు గారు తండ్రి గారివలె సాత్త్విక స్వభావం కలవారు. మిత మధురభాషి. ఆడంబరములకు పోవువారు కాదు. ధార్మిక ప్రవృత్తి కలవారు. ఆశ్రమాలను సాధు సంన్యాసులను దర్శిస్తూ సత్సంగంలో గడుపు స్వభావం కలవారు. వీరు 1974వ సంవత్సరంలో పండిత గోపదేవ్ శాస్త్రిగారి ఉపన్యాసాలు వినటం తటస్థించినది. వైదికధర్మంతో పరిచయం ఏర్పడింది. సత్యాన్వేషకులు కావటం వల్ల అచిరకాలంలోనే వైదిక ధర్మంపై శ్రద్ధాభక్తు లేర్పడ్డాయి.

వైదిక సాహిత్యాన్ని చదువుతూ సత్సంగాలు నేర్పాటు చేస్తూ క్రమంగా తమ జ్ఞానాన్ని వృద్ధి చేసుకుంటున్నారు. ప్రస్తుతం వీరు భువనగిరి సమీపంలో హనుమాపురం గ్రామ పరిధిలోని వైదిక వానప్రస్థ సాధకాశ్రమాన్ని మిత్రులతో కలిసి స్థాపించి దానిని వృద్ధి చేయటానికి మిక్కిలిగా శ్రమించుచున్నారు. 5-8-2001వ తేదిన స్థాపించబడిన ఈ ఆశ్రమానికి వీరు ఒక స్థాపక ట్రస్టీయేగాక, ఆది నుండి యిప్పటివరకు కార్యదర్శిగా సేవలందించుచున్నారు.

ఈ 'మాతా పుత్రికల జ్ఞానచర్చ'కి ప్రథమ ముద్రణ (1991లో) వెయ్యి ప్రతుల వ్యయాన్ని భరించి మా ట్రస్టునకు సాయపడ్డారు. ఆ పుస్తకాలు అయిపోయి చాలాకాలమయ్యింది. మరల ఈ రెండవ ముద్రణకును అన్నదమ్ములు నలుగురును కలిసి వెయ్యిప్రతులు ముద్రించి 500 ప్రతులు బంధుమిత్రులకు వితరణచేసి మిగిలిన 500 ప్రతులను మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు దానముగా నిచ్చుచున్నారు. రెండవ కుమారుడైన శ్రీ దామోదర రావుగారు 25-4-2012 తేదీన దివంగతులగుటచే వారి స్మృతిలో వారి దత్తపుత్రుడు శ్రీ సురేంద్రరావు గారు ఆ వ్యయాన్ని భరిస్తున్నారు. **ఈ పుస్తకాన్ని శ్రీ రామారావు గారి 80వ జన్మదినమున 2-9-2012 తేదీన వితరణ చేయుచున్నారు.** వీరందరికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు ఈ దాతలందరికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాదులనిచ్చి కాపాడును గాక ! మరిన్ని దాన ధర్మాలు చేయ ప్రేరణ కలిగించును గాక !

- **సుమ్నార్థి** (డా. కోడూరి సుబ్బారావు)

## ఈ "మాతా పుత్రికల జ్ఞానచర్చ" లో



చదవండి ఆలోచించండి

సత్యాన్ని గ్రహించి ఆచరించి ప్రచారం చెయ్యండి

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణి స్త్రీ) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20=00), గర్భాధాన విజ్ఞానము (30=00), మావన ధర్మము (10=00), అశ్వినీ దేవతలు(20=00), సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము(20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (30=00), గాయత్రీ విజ్ఞానం (50=00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం(70=00), మన వేదశాస్త్రాల పరిచయం (50=00), చతుర్దశ భువనములు (10=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), యజ్ఞోపవీత వైశిష్ట్యము(2=00), లక్ష్మీసూక్తము (2=00), శాంతిప్రార్థన (2=00), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10=00), మరణానంతరం జీవుని ప్రయాణం (40=00), ప్రణవ స్తోత్రము (10=00) వైదిక సరస్వతీ స్తోత్రము (10=00), వేదాల వెలుగుచూపే ఆర్యసమాజం (20=00), మాతా పుత్రికల జ్ఞానచర్చ (50=00), పెండ్లినాటి ప్రమాణాలు (ముద్రణలో)

# సృష్టికర్త ఉపదేశం

ఋషిః - వసిష్ఠః
ఛందస్సు - విరాట్ త్రిష్టుప్
దేవతా–సోమః
స్వరః– ధైవతః

**సువిజ్ఞానం చికితుషే జనాయ**
**సచ్చాసచ్చ వచసీ పస్పృధాతే ।**
**తయోర్ యత్ సత్యం యతరద్ ఋజీయః**
**తదిత్ సోమో అవతి హన్త్యాసత్ ॥**

- ఋగ్వేదం (7-104-12) అథర్వవేదం 8-4-12)

ఉత్తమ విశేష జ్ఞానము నెరుగగోరు మానవుల ఎదుట సత్యము మరియు అసత్యము ఒకదానితో నొకటి పోటీపడుచు నిలుచును. ఆ రెంటియందు ఏది సత్యమో, ఏది కపటరహితమో దాని ననుసరించు మానవులు పరమేశ్వర రక్షణను పొంది పరమశాంతి నొందుదురు. అసత్ (అసత్య) జ్ఞానము ననుసరించువారు సంసార సముద్రమున మాటిమాటికి చంపబడుచు దుఃఖముల పాలగుదురు.

**కావున సత్యము నెరుగ ఈ గ్రంథమును**

**ఆలోచించుచు చదవండి**

# సంపాదకీయము

**"నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే"** (భగవద్గీత: 4-38)

జీవాత్మలమైన మనను పవిత్రపరచు సాధనములలో జ్ఞానముతో సమానమైనది కాని, మించినది కాని మరియొకటి లేదు. జ్ఞాన మనగా యథార్థ జ్ఞానము. ఏ పదార్థము యెట్లున్నదో దానినట్లే తెలిసికొనుట "యథార్థ దర్శనం జ్ఞాన మితి" (భగవద్గీత: 13-11)

నేడు విజ్ఞానము శరవేగమున పురోగమించుచున్నది. మానవుడు చంద్ర లోకమున కాలిడి దాని పై గ్రహములను కూడా అందుకొన యత్నించు చున్నాడు. ప్రతి పదార్థమును విశ్లేషించుచు అణుగర్భమును కూడా భేదించి పరమాణువును తెలిసికొన యత్నించుచున్నాడు. మానవ మేధస్సుకు ప్రతిరూపమైన కంప్యూటర్లను, రోబోటులను నిర్మించు చున్నాడు. ఇక విద్యారంగమున అక్షరాస్యతతో బాటు ఆలోచనా శక్తి పెరుగుచున్నది. నాగరికతతో బాటు హేతువాదము, వివేకము వికసించుచున్నవి. కాని భౌతిక విషయములందు ఇంతగా పురోగమించు మానవుడు ఆధ్యాత్మిక రంగమున స్తబ్ధుడైనాడెందుకు? అది తనకు అవసరం లేదనియా? లేక అది తన జీవనావ సరముల నేమితీర్చు ననియా? విజ్ఞాన విషయములందు అత్యంత వివేకము చూపు విద్యావంతులు కూడ ఆధ్యాత్మిక విషయములను గ్రుడ్డిగా అనుకరించు చుండుట విచిత్రము. ఆ రంగమున అంధానుకరణయే రాజ్యమేలు చున్నది. పురోగమనమునకు మారు తిరోగమనమే గోచరించుచున్నది. పశుపక్ష్యాదులవలె ఆహార, నిద్రా, భయ, మైథునములే పరమావధి యగుచున్నవి. మానవుడు దయామయుడైన పరమేశ్వరుడిచ్చిన బుద్ధిని పూర్తిగా భౌతిక విషయములందే వ్యయము చేసి స్వర్గ సుఖముల నందగోరుచున్నాడు. దానివల్ల కొన్ని సుఖములు పొందగలిగినను అంతకుమించి అశాంతియే యెదురగుచున్నది. భౌతిక విజ్ఞానము పెరుగు

కొలది మానవ జీవితము క్రమక్రమముగా భయాందోళనలతో దుర్భర మగుచున్నది. ఇదే భౌతిక విజ్ఞానము వలన మనము సాధించిన ఫలము.

క్రాంతదర్శులైన ప్రాచీన ఋషులు ముందుచూపుతో భౌతిక విజ్ఞానము వలన కలుగు అనిష్టమును ముందే గుర్తించి పరమ శాంతి నిచ్చు ఆధ్యాత్మిక విజ్ఞానమునకు పెద్దపీట వేసిరి. అట్లని వారు భౌతిక విజ్ఞానమును విస్మరించలేదు. మన జీవన నిర్వహణ కవసరమైనంత వరకు దానిని కూడా వృద్ధిపరచిరి. వైద్య, వాస్తు, యంత్ర, విమానాది శాస్త్రముల నెన్నింటినో నిర్మించిరి. వీటిని మించి ఆధ్యాత్మిక క్షేత్రమున విస్తృత శాస్త్రముల నిర్మించిరి. యోగ సాధనతో పరమానంద స్పర్శను పొంది పరమ శాంతిని పొందిరి. వారు వృద్ధిపరచిన ఆధ్యాత్మిక జ్ఞానము బ్రాహ్మణ, అరణ్యక, దర్శన, ఉపనిషదాది గ్రంథములందు కాననగును. అదియే మానవులకు నిజమైన సుఖశాంతులను ప్రసాదించును.

విధి వైపరీత్యము వలన మహాభారత యుద్ధానంతరము క్రమముగా ఐశ్వర్యముతో బాటు ఆధ్యాత్మిక జ్ఞానము లోపించుచు విదేశీ మత సంస్కారములతో కూడిన సాంప్రదాయక మత మతాంతరములు వ్యాప్తి జెందినవి. వైజ్ఞానికమైన వేద సంస్కృతి స్థానములో అవైజ్ఞానికమైన పురాణ సంస్కృతి రాజ్యమేలుచున్నది. అది విద్యావంతులను, విజ్ఞానవేత్తలను కూడ తన వశమున పెట్టుకొని వికటాట్టహాసము చేయుచున్నది. దాని చెరనుండి మానవ జాతి విముక్తి పొందునా? యనియు సందేహము కలుగుచున్నది.

కాని ఆర్యులు ఆశావాదులు. ఆలస్యముగానైన సత్యము గుర్తింప బడుననియు, జ్ఞాన కిరణములు కొన్నియైనను గాఢాంధకారమును పటాపంచలు చేయగలవనియు వారు నమ్ముదురు. ఆ దృష్టితోనే మహర్షి దయానందుడు "సత్యార్థ ప్రకాశ"మను నొక అద్భుత గ్రంథమును రచించెను. అది సూర్యకాంతి వంటి సత్య ప్రకాశము. దానిముందు ఎంతటి భయంకర కారుచీకటులైన తోక ముడువక తప్పదు. నే డది విరివిగా ప్రచారము గావలసి యున్నది. ముఖ్యముగా అది స్త్రీలలో ప్రచారమైన శరవేగమున వ్యాప్తి జెందగలదు. తల్లి

ప్రభావమే పిల్లలపై ఎక్కువగా నుండును. ఆమెయే మన మొదటి జ్ఞానదాత. ఆమె నాటిన బీజములే కాలక్రమమున వృక్షములై విస్తరించును. మగపిల్లల వలన ఆ బీజములు సామాన్య వృక్షములై సామాన్య ఫలితములనివ్వగా, ఆడపిల్లల వలన మరల వారి సంతతికి ఆ జ్ఞానమందుచు వటవృక్షముల వలె బహుముఖముగా విస్తరించి విశేష ఫలితముల నిచ్చును. కాన స్త్రీలను జ్ఞానవంతుల జేయుటకు వైదిక ధర్మాభిమానులందరు కృషి జేయవలసి యున్నది.

ఈ దృష్టితోనే ఆర్య విద్వాంసులు డా. శ్రీరాం ఆర్యగారు తల్లులలో, యువతులలో ఈ జ్ఞానబీజములు నాటవలెనని అందు కనుగుణముగా వైదిక సిద్ధాంతములను జన సామాన్య భాషలో "మాతా పుత్రియోంకా సంవాద్" అను పేరుతో నొక గ్రంథమును వ్రాసిరి. దాని అనువాదమే యీ "మాతా పుత్రికల జ్ఞాన చర్చ". ఇందూరు వాస్తవ్యులు, ఆర్య పురోహితులుగా ప్రసిద్ధి జెందిన బహు గ్రంథకర్తలు పం. లోక మల్హరి గారు గ్రంథకర్త అభిప్రాయమున కనుగుణముగా జనసామాన్య భాషలో దీని ననువదించిరి. అనువదించి చాలా కాలమైనను నేటికి మనకు చదివే భాగ్యము కలిగినది. వీరి అముద్రితములైన అనువాద గ్రంథములు మరెన్నియో గలవు. అన్నింటిని మేము ప్రచురించలేక పోయినను మేము కోరిన వెంటనే యీ గ్రంథమును మా కొసంగి మమ్ము ధన్యుల జేసిరి. 'స్త్రీల కొరకు ఒక మంచి పుస్తకము ప్రచురించవలె'నను మా చిరకాల వాంఛ నేటికి కార్యరూపమును ధరించి యీ పుస్తక రూపమున మీ ముందుకు వచ్చినది. రచయితలకు, అనుకర్తలకు, దాతలకు మా హృదయపూర్వక ధన్యవాదములు. మా పూర్వ ప్రచురణల వలెనే ఆంధ్ర పాఠకులు దీనిని గూడా ఆదరించి బహుళ ప్రచారము చేసి స్త్రీలలో జ్ఞానబీజముల నాటుటకు ప్రయత్నము చేసినచో మా అందరి కృషి సఫలము కాగలదు.

**– సుమ్నార్థి (కోదూరి సుబ్బారావు)**

**"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః"**

ఓ3మ్

# ప్రస్తావన

మహిళా లోకమున వైదిక ధర్మ సిద్ధాంతముల ప్రచార మొనర్చుటకు కథల, సంవాదముల రూపమున నుండు సాహిత్య మెంతయో అవసరము. కన్యా విద్యాలయములందు పఠన పాఠనములకును, పారితోషిక రూపమున బహూకరించుటకును బాలబాలికల కుపయోగపడు సాహిత్య నిర్మాణమునందు ఆర్య విద్వాంసులంతగా శ్రద్ధ చూపుట లేదు. ఈ కొరతను తీర్చుట కొరకే ఈ పుస్తక రచన జరిగినది. స్త్రీలకు ప్రశ్నోత్తర రూపమున వైదిక ధర్మ సిద్ధాంత పరిచయము గలుగజేయుటకొర కీ పుస్తక మెంతయో ఉపయోగపడ గలదు. దీనికి వాడిన భాష సరళము. ఐనను సైద్ధాంతిక విషయములు కొంత క్లిష్టముగనే యుండును. శిక్షిత బాలబాలికలు, స్త్రీ పురుషులు దీనిని అర్థము చేసికొని వైదిక ధర్మమునందలి ముఖ్య ముఖ్య సిద్ధాంతములను తెలిసికొనినచో అన్య సాంప్రదాయకుల ప్రశ్నలకు, సందేహములకు సమాధానముల నీయగలుగుదురు. ఈ పుస్తకమును చదివి అవగాహన మొనర్చుకొనినచో అనేక సంశయములకు సమాధానములు లభించగలవు.

కన్యా విద్యాలయాధ్యాపికలు, సంచాలకులు ఈ పుస్తకమును ధార్మిక శిక్షారూపమున తమ విద్యాలయములందు చదివించునట్లు, గృహములందు స్వాధ్యాయ రూపమున పఠించునట్లు ప్రయత్నించినచో, కన్యలు ధార్మిక సిద్ధాంతములు తెలిసికొని అనుసరించగలుగుదురు.

ముస్లిం, ఈసాయీల విద్యాలయములందు శిక్షణ పొందుచున్న

బాలబాలికలకు వారి మతముల గురించి ఎంతో కొంత పరిచయ ముండును. కాని మన మహిళామతల్లులకు, శిక్షిత కన్యారత్నములకు స్వధర్మ విషయము లేమాత్రము తెలియవు. కావుననే ఇతరులడిగి నప్పుడు మౌనముగ నుందురు. ఈ పుస్తక మీ లోటును తీర్చగలదని భావింపబడుచున్నది.

స్త్రీలు, బాలికల వలెనే పురుషులు, బాలురు ఈ పుస్తకమందలి విషయముల నవగాహన మొనర్చుకొనినచో వైదిక ధర్మ సిద్ధాంతముల ప్రచారము సమున్నతముగ జరుగగలదు. కావున బాలబాలికలెల్లరును ఈ గ్రంథమును సమాదరించి ధర్మ ప్రచారమున సహకరించగలరని ఆశించబడుచున్నది.

కాస్‌గంజ్ (ఏటా) ఉత్తరప్రదేశ్ వాస్తవ్యులు ఆచార్య డాక్టర్ శ్రీరాం ఆర్యగారు "మాతా పుత్రియోంకా సంవాద్" అను పుస్తకమును ప్రశ్నోత్తర రూపమున వ్రాసినారు. తెలుగు సోదర సోదరీమణులకు అత్యంతోప యుక్తముగ నుండునని యెంచి దీనిని "మాతా పుత్రికల జ్ఞాన చర్చ" యను పేరుతో తెలుగులోని కనువదించితిని. పాత్రల నామములు మాత్రము తెలుగు భాష కనువుగ నుండునట్లు మార్చబడినవి. పాఠకులీ స్వల్ప భేదమును గ్రహింతురుగాక! దీనిని సవరించి యిచ్చిన నా చిరు సహోదరుడు, వీతరాగి శ్రీ లోకా లక్ష్మీనారాయణ (మనస్వీ) గారికి నా ఆశీర్వాదపూర్వక ధన్యవాదములు.

దీనికి ముద్రణ భాగ్యము గలిగించిన ఉదార ద్రవ్యదాతలకు దయామయుడగు పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక. ఇందులకు సఫల ప్రయత్నము నొనర్చిన వైదిక సేవా తత్పరులగు డా. కోడూరి సుబ్బారావు ఆర్య, వ్యాస్‌నగర్, సీతాఫల్‌మండి గారికి గాయత్రీ ఆశ్రమ ట్రస్టు కార్యవర్గమునకు నా కృతజ్ఞతాభి వందనములు.

ఇట్లు

వైదిక ధర్మానురాగి

**లోకా మల్హారి సిద్ధాంతాచార్య**

ఇందూరు (నిజామాబాద్)

ఓ౩మ్

# మాతా పుత్రికల జ్ఞాన చర్చ

## ప్రథమాధ్యాయము

భారతదేశము నందలి ఆంధ్ర రాష్ట్రమున సిద్ధిపేట యను నొక పట్టణము కలదు. అందు డా. శ్రీ యల్. శంకర్ అను నొక ఆర్యమనన శీలునకు సౌ. అన్నపూర్ణ యను సతీమణి, హరనాథ్ అను కుమారుడు, వీణాదేవి, హంసవేణి యను ఇరువురు కూతుళ్లును కలరు. వీరెల్లరును అత్యంత ఈశ్వరభక్తి, సంధ్యాగ్ని హోత్రములం దాసక్తి కలవారు. ఒకనాడు వీణాహంస లిరువురును ఒక విషయమును చర్చించుకొనిరి. తల్లిని సమీపించి “అమ్మా! ఈ ప్రపంచమున నానావిధ మతమతాంతరము లెట్లేర్పడినవి? వీనివల్ల మానవ సమాజము విభక్తమై పరస్పర శత్రుత్వ మేర్పడినది. ఇందుకేమి కారణ”మని ప్రశ్నించినారు. అందుకు తల్లి వారితో “అమ్మాయిలూ! మీ ప్రశ్నకు రేపు సమాధానము నిత్తును, ఇంకా ఏమైన సందేహములున్ననూ వానికి కూడా రేపే సమాధానము లభించగలదు”అని చెప్పినది.

మరునాడు సంధ్య దైనిక యజ్ఞాది కార్యక్రమములు, నిత్య గృహకృత్యముల యనంతరము అన్నపూర్ణాదేవి కూతుళ్ల నిరువురను పిలుచుకొని తమ

గృహమందలి స్వాధ్యాయ విభాగమున వారికెదురుగ గూర్చుండెను. శంకా సమాధానములు ప్రారంభించబడినవి.

1. ప్రశ్న : వీణాదేవి:- అమ్మా! ఈ కాలమున ప్రపంచము నందనేక మత సంప్రదాయములు స్థిరపడి యున్నవి. ఎల్లరును తమ మతమే సత్యమని, ఇతరులది మిథ్యయని యందురు. ఇట్టి పరస్పర విరుద్ధ సాంప్రదాయముల కారణమున మానవ సమాజమున అశాంతి, వైషమ్యములు, కలహములు అతిగా పెరిగిపోవుచున్నవి. దీనివల్ల మానవ జాతి కెంతయో హాని కలుగుచున్నది. భిన్నములైన పరస్పర విరుద్ధ సిద్ధాంతములు, ఆలోచనలు గల ఈ ధర్మవిరుద్ధ ప్రవాహము నరికట్ట వీలగునా?

ఉత్తరము : అన్నపూర్ణ :- బిడ్డా! నీవడిగినది కడు ఉత్తమమైన ప్రశ్న. వాస్తవముగ ధర్మమొక్కటే. విభిన్న మతము లనునవి సాంప్రదాయములు మాత్రమే. ప్రతి మతము ఏదో యొక వ్యక్తిద్వారా ప్రారంభింప బడినదే. ఆ వ్యక్తి తన బుద్ధికి తోచినట్లు ఈశ్వరుడు, ఆతని యుపాసన విషయములను తన భక్తుల కుపదేశించి ఒక సంప్రదాయమును ప్రారంభించును. ఆతని యా భావ ప్రవాహమున శ్రద్ధ గలవారెల్లరును ప్రవహించగా దేశమున నొక నవీన సంప్రదాయము ప్రారంభమగును. మానవుడు అల్పజ్ఞుడగుట వలన అతని ద్వారా స్థాపితమగు సంప్రదాయము మిథ్యాకల్పనలపై ఆధారపడి యుండును. ఈ కారణము వలననే విభిన్న సంప్రదాయములందు అభిప్రాయ భేదములు అత్యధికముగనే యుండును. ఇక ధర్మమునకు సంబంధము పరమాత్మతో నుండును. కేవలము పరమాత్మయే సర్వదా సత్యము, నిర్భ్రాంతమైన తత్త్వము. ఆతడిచ్చిన వేదజ్ఞానము గూడ నిర్భ్రాంతమే. కావున వేద ధర్మమే సత్యసనాతన మానవ ధర్మము. దాని వల్లనే విశ్వకల్యాణము జరుగగలదు. మానవులెల్లరును పక్షపాత, దురాగ్రహములను త్యజించి వేదాధ్యయన మొనర్చుచు అది చూపిన సత్యమార్గమున నడచినచో సాంప్రదాయక మత భేదములు సమాప్తమై మానవ సమాజము సంఘటితము కాగలదు. సాంప్రదాయక విభేదముల వల్ల కలుగు పరస్పర వైమనస్యములు, ద్వేషములు నశించగలవు.

2. ప్రశ్న : వీణ :- పరమాత్ముడు కనుపించడు గదా? ఆతని యస్తిత్వము నెట్లు నిరూపించగలము?

ఉత్త : అన్నపూర్ణ :- నీవడిగిన ప్రశ్న అత్యుత్తమమైనది. ప్రతి వస్తువును మనము కన్నులతో చూడజాలము. అంతమాత్రమున దాని యస్తిత్వము లేకుండా పోదుగదా! పదార్థ జ్ఞానము కొరకు మానవునకు ఐదు జ్ఞానేంద్రియములు గలవు. నేత్రములు కేవలము రూప జ్ఞానమును, ముక్కు కేవలము గంధ జ్ఞానమును, చెవులు శబ్ద జ్ఞానమును, త్వచ (చర్మము) స్పర్శ జ్ఞానమును, నాలుక రుచి జ్ఞానమును గలిగించును. ఈ యైదు జ్ఞానేంద్రియములు కేవలము తమకు సంబంధించిన విషయముల జ్ఞానమును గలిగించు వరకే పరిమితమై యున్నవని నీకు తెలియును. వీనియందు ఏ యింద్రియము గూడా ఇతరేంద్రియమునకు సంబంధించిన జ్ఞానమును కలిగించజాలదు. అనగా - ముక్కు చూచుట, చెవి స్పర్శను దెలిసికొనుట, కన్నులు రుచి చూచుట, త్వచ గంధమును తెలిసికొనుట, నాలుక వినుటవంటి జ్ఞానమును గలిగింపజాలవు. ప్రకృతి యొక్క ఐదు తత్త్వములు అగ్ని, జలము, వాయువు, పృథివి, ఆకాశముల వల్లనే ఈ సృష్టి నిర్మాణము జరిగినది. ఈ శరీరములన్నియును ఈ యైదు తత్త్వముల వల్లనే ఏర్పడినవి. ఈ యైదు తత్త్వముల గుణములను గూడా పరమాత్మ నిశ్చిత మొనర్చినాడు. అగ్నికి రూపము, జలమునకు రసము, వాయువునకు స్పర్శ, పృథివికి గంధము, ఆకాశమునకు శబ్దము అనునవి యా గుణములు. ఈ పంచభూతముల గుణములను పంచతన్మాత్ర లనియు నందురు. వీనిని దెలిసికొనుటకు పరమేశ్వరుడు మనుష్య శరీరమున కన్నులకు రూపము, నాలుకకు రుచి, చర్మమునకు స్పర్శ, నాసికకు గంధము, కర్ణములకు శబ్దము వంటి శక్తిని ప్రసాదించినాడు. ఈ యైదు జ్ఞానేంద్రియములు కేవలము పంచభూతములచే నిర్మితమైన స్థూల పదార్థముల గుణములను మాత్రమే తెలిసికొనగలవు. పరమాత్మ మరియు జీవాత్మ యను నీరెండును పంచ భూతములకు భిన్నమైన అభౌతిక పదార్థములు. ఈ యైదు జ్ఞానేంద్రియములు పరమాత్మను గ్రహించి తెలిసికొనజాలవు. కావుననే పరమేశ్వరుడు అగోచరుడని

యనబడును. జీవాత్మ తమ యంతఃకరణమున పరమాత్మానుభూతిని పొందగలదు.

చూడమ్మా! ప్రపంచమందలి ప్రతి పదార్థములో జ్ఞానపూర్వక, నియమపూర్వక నిర్మాణముండును. మానవుల ద్వారా, ఇతర జీవుల ద్వారా నిర్మాణము కుమ్మరి కుండలను జేయునట్లు కర్త వెలుపలినుండి జరుగును. కాని ప్రకృతియందు పదార్థముల నిర్మాణము లోపలినుండియే జరుగుటను చూచుచుందుము. ఆ పదార్థములందు నిర్మాత వ్యాపకుడై యుండి రచన నొనర్చును. వెలుపలినుండి పదార్థముల నిర్మాణము జరుగుచోట కర్త నిర్మాణ పదార్థములకు వేరై యుండును. కర్త ప్రత్యక్షముగ నున్నను, అప్రత్యక్షముగ నున్నను నియమము నియామకుని ఉనికికి ప్రమాణము. కార్యము కర్తకు ప్రమాణము. ఈ విశ్వమందు ప్రతి అణువునందును ప్రతి క్షణము విజ్ఞానపూర్వకముగ జరుగుచుండు క్రియ దానియందు వ్యాపించియున్న కర్తయగు పరమేశ్వరుని ఉనికికి ప్రత్యక్ష ప్రమాణము. ఇట్లు పరమాత్ముని యస్తిత్వ జ్ఞానము ప్రతి జ్ఞానవంతుడు గలిగి యుండునని నీకిప్పుడు తెలిసియుండును. ఈ కార్యక్షేత్రములందు లోపలినుండి జరుగు రచన పరమాత్మునిదే. జీవుల ద్వారా రచన వెలుపలినుండియే జరుగును. విశ్వమున ఎంత గొప్ప విద్వాంసుడైనను ఒక వేప ఆకునుగూడ చేయజాలడు. ఈ ఆకు ఏయే తత్త్వములను ఎట్లు మేళవించి అనేక గుణ సంపన్నముగ నిర్మింపబడినదో ఎట్టి విజ్ఞానవేత్త యైనను పూర్ణముగా గుర్తించలేదు. ఈ సృష్టిలోని పూర్ణము, విజ్ఞానమయమునైన రచన మహా విజ్ఞానియగు ఆ పరమేశ్వరుని ప్రత్యక్షపరచగలదు. మానవ శరీరము నందలి ఒక్క సూక్ష్మనాడి, ఒక్క వెంట్రుక రచనను గూడ ఎవ్వరును పూర్ణముగా తెలిసికొనజాలరు. ఇవి యన్నియును పరమేశ్వరుని యస్తిత్వమును, ఆతని నిర్మాణ కౌశలమును, చమత్కారమును చాటుచున్నవి. కార్యమును జూచినప్పుడు కర్త ప్రత్యక్షమగును గదా!

3. ప్ర. వీణ:- అమ్మా! మతవాదు లనేకులు పరమాత్మ స్వర్గమునందో, కైలాసమునందో, విష్ణులోకములోనో, జన్నత్‌లోనో, పరలోకమందో, ఏడవ లేదా నాలుగవ ఆకాశము పైననో నివసించుచుండునని విశ్వసింతురు. మీరేమో

ఆతడు సర్వవ్యాపకుడని తెలుపుచున్నారు. ఇతర మతస్థుల మాటలను విశ్వసించినచో హాని యేమి?

ఉ :- అన్య మతస్థుల ఈ విశ్వాసములు మిథ్యలు. ఏలయన వారు పరమేశ్వరుని ఏకదేశీయుడు (ఒకే స్థానమున నుండువాడు) అని తలచుచున్నందువల్ల వారియందనేక దోషములు ప్రవేశించుచున్నవి. ఎట్లన - ఒకే స్థానము నందుండువాడు సర్వవ్యాపకుడు గాజాలడు. సర్వవ్యాపకుడు గానివాడు సర్వాధారుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి యెట్లగును? ఈ విశ్వ మనంతమైనది. ఈ యనంత విశ్వమును ధారణ మొనర్చువాడు, అనంతమును సృష్టించువాడు, దీని వ్యవస్థ నొనర్చువాడు అనంతుడేయై యుండవలెను. ఏకదేశీయ సత్తా (శక్తి) అనంతము యొక్క వ్యవస్థ నొనర్చజాలదు. అనంత వ్యాపకుడగు పరమాత్మ ధారణ మొనర్చకున్నచో ఈ యసంఖ్యాకములైన లోక లోకాంతరములు పరస్పరము ఢీకొని ధ్వంసమై పోగలవు. ఏకదేశీయమగు వస్తువెంత పెద్దదైనను అది ఆకాశమునందొక పరిమిత స్థానముననే ఆబద్ధమై యుండగలదు. అట్లైన ఆకాశము పరమాత్మునికన్న పెద్దదైపోగలదు. వైశాల్యమునందు పరమాత్ముడు చిన్నవాడగును. ప్రతి సాకార వస్తువు గూడ పరిమితమైనది. దాని శక్తి, జ్ఞానము కూడ పరిమితమైనవే. పరిమిత జ్ఞానవంతుడు సర్వజ్ఞుడు గాజాలడు. ఈ యనంత విశాల విశ్వమునందలి ప్రతి పరమాణువు నందును ప్రతి క్షణము జరుగుచుండు జ్ఞానపూర్వకమగు సృష్టి మరియు క్రియలను పరిమిత జ్ఞానవంతుడు చేయజాలడు. ఈ విశ్వవ్యాపక, జ్ఞానపూర్వక, వైజ్ఞానిక నియమముల ఆధారమున జరుగుచున్న క్రియయే పరమాత్మ ఒక అనంత శక్తియని, నిరాకార సత్తాయని తెలుపుచున్నది. ఒకే స్థానమందుండువాడు సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి, విశ్వవ్యాపకు డెట్లగును? అతులితుడు, అనుపముడు గూడ కాజాలడు. కావుననే పరమాత్ముడు ఏకదేశీయుడు, ఏకస్థానమునం దుండువాడని భావించు కల్పన మిథ్యయే.

4. ప్ర. హంసవేణి :- అమ్మా! కొందరు "ఆత్మ, పరమాత్మ యనున దొక్కటే.

జీవాత్మ పరమాత్మయొక్క అంశము మాత్రమే. జీవాత్మయే పరమాత్మయందు గలిసి పరమాత్మయై పోవు"నని యందురు. జీవాత్మ ముక్తుడై పరమాత్మ యగుననియును, 'పరమాత్మ' యనునదొక ఉన్నత స్థానము (పదవి). దానిని ప్రాప్తించుకొనినవాడే 'పరమాత్మ'యని మరికొందరందురు. ఇందేది నిజము?

ఉ :- ఏదియును నిజము గాదు. జీవాత్మ పరమాత్మ ఒక్కటే అనువారి వాదన సత్యదూరము, నిరాధారము. జీవాత్మ అల్పజ్ఞుడు, ఏకదేశీయుడు. జనన మరణ చక్రమున భ్రమించు అనాది చేతన శక్తి. పరమాత్ముడు సర్వవ్యాపకుడు, చైతన్యుడు, సర్వజ్ఞుడు, సర్వాధారుడు, సర్వశక్తిమంతుడు, ఆనందస్వరూపుడు, విశ్వనియంత, విశ్వమును ధరించి పోషించువాడు. జీవులకు వారి కర్మానుసారము ఫలమునిచ్చు మహత్తర శక్తి. జీవ పరమాత్మలు భిన్న భిన్న శక్తులు. జీవాత్మ సూక్ష్ముడు, పరమాత్మ సూక్ష్మాతిసూక్ష్మ డైనందువల్ల విశ్వమునందలి ప్రతి యణువునందును, పరమాణువునందును, జీవులలోను వ్యాపకుడై యుండును. జీవాత్మ పరమాత్మ అంశమగుచో నాతడుగూడ సర్వజ్ఞుడేయై యుండవలెను గదా! బంగారు గుణములు దాని యంశము నందును సమానముగ నుండునట్లే పరమేశ్వరుని యందుండు గుణము లన్నియును జీవాత్మయందుండవలెను గదా! ఉండవలయును.

అంశము ఎప్పుడైనను తన మూలమునందు కలిసిపోవును. ఏదేని ఒక వస్తువు ఒక విశిష్ట కాలమున, విశిష్ట కారణము వలన దాని మూలము నుండి వేరు చేయబడును. కావుననే అది దాని మూల వస్తువునకు అంశ మనబడును. జీవాత్మ పరమాత్మ యొక్క ఒక అంశమే యైనచో అది పరమాత్మ నుండి వేరైనప్పటినుండియే ఉత్పత్తి (జన్మించి) యుండవలయును. ఉత్పత్తియగు కారణమున జీవాత్మ నాశముగూడా నొందవలయును. ఏల యన- ఉత్పత్తియగు వానికి నాశము తప్పదు. ప్రారంభమగు దానికి పరిసమాప్తి యుండును. 'ఆది' యుండుదానికి 'అంత'మనునది తప్పక యుండును. కాని జీవాత్మ అజరామర శక్తి. అది ఎప్పుడును ఉత్పన్నము కాలేదు.

'అంశ' మనునప్పుడు పరమాత్ముని యంశము (ఖండము) నెప్పుడు, ఎవ్వరు చేసినారు? పరమాత్మ తన ఖండములను తాను జేసికొనినాడా? లేక యితరులెవరైనను కోసి ముక్కలు ముక్కలుగ జేసి జీవాత్మలుగ జేసినారా? పరమాత్మయును ఖండఖండములుగ అగుటయో, చేయబడుటయో జరిగినచో సంపూర్ణ పరమాత్మ వినాశము నొందగలదు గదా! అంశమునందేదేని వికారము జరిగినచో దాని పూర్ణమందును అట్టి వికారము తప్పక జరుగగలదు. ఖండమగు కారణమున పరమాత్మయొక్క వికారము నొప్పుకొనవలసి వచ్చును. సంయోగ వియోగ గుణములుగల వస్తువులనే ఖండములుగ నొనర్చుట కవకాశ ముండును. పదార్థముల, పరమాణువుల సంయోగము వల్ల నిర్మాణమగు వానికే ఖండములగుట కవకాశము గలదు. కాని ఏకమై యుండి సంయోగ వియోగములు లేనట్టి ఆత్మ మరియు పరమాత్మలు ఖండములు గాజాలవు. ఈ కారణముననే జీవాత్మను పరమాత్మ యంశమని నమ్మజాలము. ఈ రెంటిని ఒక్కటిగా నిరూపించుటకు వీని గుణములు గూడ ఒక్కటిగా లేవు. కావున ఆత్మ పరమాత్మలు భిన్నములే.

ఇకపోతే; పరమాత్మ ఒక పదవి. ముక్తినొందిన జీవులు ఆ పదవిని పొంది పరమాత్మ అగుదురని విశ్వసించువారును పెడమార్గమునందే యున్నారని యనవలెను. ఈ రెండు శక్తులు భిన్నమే యైనప్పుడు పదవి (స్థానము) అనుమాట మిథ్యయే కాగలదు. ముక్తినొందిన యనంతరము జీవాత్మ పరమాత్మల సంబంధము అగ్నియందు కాలిన లోహము అగ్ని రూపమును దాల్చినట్లే యుండును. కాని యీ రెండింటి శక్తులు అగ్ని మరియు లోహము వలెనే వేర్వేరై యుండును. జీవాత్మ ముక్తుడై తన యస్తిత్వమును కోల్పోయి స్వనాశనమును జేసికొనడు. ఒకవేళ అట్లు నష్టమగుచో ఆతడు పొందవలసిన ముక్త్యానందము నెవరు పొందగలరు?

5. ప్ర : తల్లీ! పరమాత్మ నిరాకారుడగుచో ఈ యింద్రియముల ద్వారా ఆతని గ్రహించజాలకున్నచో ఆతనిని పొందుటెట్లు?

ఉ : భౌతిక శరీర రహితుడైన ఆ పరమాత్మను భౌతికములైన ఇంద్రియముల ద్వారా చూచుటగాని, ఆఘ్రాణించుట గాని, స్పర్శించుట గాని, వినుట గాని, రుచి చూచుట గాని చేయలేము. 'ప్రకృతి, జీవాత్మ, పరమాత్మ'లను నీ మూడును అనాది పదార్థములు. వీని గుణములు గూడా భిన్నములే.

<u>1. ప్రకృతి :</u> ఈ సృష్టి రచనకు పూర్వము ఏ తత్త్వము వల్ల జగన్నిర్మాణము జరిగినదో, ప్రప్రథమము నందుండు అట్టి యవస్థనే ప్రకృతి యందుము. స్థూలముగ చెప్పవలయునన్న ప్రపంచ మెట్టి తత్త్వములతో నిర్మాణమగునో ఆ మూల తత్త్వమునే ప్రకృతి యందురు. దాని ముఖ్యగుణము సత్ అనగా నిత్యమై యుండునదని భావము.

<u>2. జీవాత్మ :</u> దీని గుణము సత్ + చిత్. సత్ నిత్యత్వము. చిత్ చైతన్యవంతమై యుండునది.

<u>3. పరమాత్మ :</u> సత్ + చిత్ + ఆనందము (సచ్చిదానందము) ఆనందగుణము ప్రకృతిలోగాని, జీవాత్మలో గాని లేదు. ఈ విశేష గుణము పరమాత్మయందే గలదు. ఉదా : నీ కొకవేళ అకస్మాత్తుగా చల్లని గాలి దగిలినచో ఎచ్చటనో వర్షము కురిసినదని తలంతువు. ఏలయన, చలి జల గుణము. అట్లే వేడిగాలి దగిలినచో అగ్ని గుణము వేడి కావున ఎచ్చటనో అగ్ని మండుచున్నదని తలచెదవు. కావున గుణములవల్ల గుణియొక్క అస్తిత్వ జ్ఞానము గలుగునని మనకు తెలియుచున్నది. ధూమము (పొగ)ను జూచి అగ్ని యుండునను మాట ప్రత్యక్షమగుచున్నది.

సాధకుడు పరమాత్మ సాన్నిధ్యమునకై సమాధిస్థుడైనపుడు అతనికి ఊహింపరాని ఆనందానుభూతి గలుగును. ఆ స్థితి యందాతడు ఆనందముతో పరమాత్మ యనుభూతిని పొందగలడు. ఈశ్వరుడు ఆత్మానుభూతికి విషయము మాత్రమే. ఋషి మునులెల్లరును నేత్రములను మూసికొని భౌతిక జగత్తుతో ఇంద్రియముల సంబంధమును త్రెంచివేసి సమాధిస్థులై పరమాత్మ

ధ్యానమొనర్చుచుండిరి. ఈశ్వరుడు "చిన్తన్నవాధ్యాన" వస్తువై యున్నాడు. వైదిక ధర్మమున దర్శన, శ్రవణ, గ్రంథాధ్యయనాదులకును, పరమాత్మ ధ్యానమునకు నేమాత్రమును సంబంధము లేదు. నమాజు చేయుట, హారతి యిచ్చుట, గ్రంథములను చదువుట, మంత్రములను జపించుట, మూర్తులను దర్శించుట మున్నగు విషయములతో ధ్యానమున కేలాటి సంబంధము నుండదు. ధ్యానము ఏకాంతమున కూర్చుండి, నిశ్చింతుడై ఏకాగ్రతతో నభ్యసించిన సిద్ధించును. దర్శనము, పూజలు మున్నగువానితోనే పరమాత్మ ప్రాప్తికి సంబంధముండినచో బ్రహ్మయజ్ఞధారులగు సమస్త వైదిక ఋషులు ఏకాంతవాసమున సమాధివంటి కఠిన పరిశ్రమ నేల చేయుచుండిరో మీరు చక్కగా నాలోచించిన తెలిసికొనగలరు.

మూర్తుల దర్శనమునే పరమేశ్వరుని దర్శనమని ఎంచువారును ఎంతో మోసపోవుచున్నారని యనవచ్చును. ఎవరి 'దర్శనము' – నిరాకార, సర్వవ్యాపక పరమాత్మునిదా? లేక భౌతికమూర్తులదా? మూర్తియనునది ఒకప్పుడుండి ఇప్పుడు లేనట్టి ఒక మానవాకృతికి ప్రతిరూపము. నిరాకారుడు, సర్వవ్యాపకుడగు పరమేశ్వరునికి ఎట్టి యాకృతియు లేనందున అతని మూర్తి యుండుననుట అవాస్తవము. మన నేత్రములు కేవలము పరమేశ్వరునితో ఎట్టి సంబంధము లేని భౌతికమూర్తి యొక్క ఆకృతి, రూపు, వర్ణము, వస్త్రాభూషణాదులు, సౌందర్యము మున్నగు వానినే చూచుచుండును. ఏల యన, పరమాత్ముడు రూప రస గంధాదుల కతీతుడు. కావున భౌతిక ఇంద్రియములతో ఆతని జూడజాలము.

6. ప్ర : హంస : మనస్సును కేంద్రీకృత మొనర్చుటకై ధ్యానమునకు ఏదేని యాకృతి అవశ్యకమై యుండును గదా! నిరాకారుడగు పరమేశ్వరునకు ఎట్టి యాకృతియు నుండనందున ఆతని ధ్యానమెట్లు జేయగలము?

ఉ : పరమాత్మునికెట్టి యాకృతియు లేదు. ఆకృతి ధ్యానము పరమాత్మ ధ్యానము కానేకాదు. ఎవరైనా ఏదేని ఆకృతిని కల్పించుకొనిన అది మిథ్యయే యగును.

మిథ్యాకృతి కల్పన పరమాత్ముని యుపాసనకు సహాయకారి గాజాలదు.

ఒక ధనవంతుని ధనము నష్టమైనచో నాతడు తన ధనమును దలచుకొని దుఃఖించును. కాని నోట్లు, రూపాయల నాణెములను దలచుకొనుచు సంతృప్తి చెందడు. అట్లే సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని శక్తిపై పూర్ణ విశ్వాసము గల సాధకు డట్టి విశ్వాసముతోనే ఈశ్వర ధ్యానమున తన్మయుడగును. కాని అతనికేదో యొక మూర్తిని, ఆకృతిని గల్పించుకొను అవసర మేమాత్రము నుండదు.

ప్రపంచము నందలి ముస్లిములు (విద్వాంసులు, అవిద్వాంసులు) ఈశ్వర భక్తి, ప్రార్థనోపాసనలు ఆతని నిరాకారుడని యెంచి చేయుట లేదా? ఐతే మన సమాజమునకే మూర్తుల యాకృతుల కల్పనావసర మేల గలుగుచున్నది? ఆకృతియే లేనివాని మిథ్యాకృతి కల్పన లేల చేయబడుచున్నవి? ఏ శక్తి యెట్టిదో దాని చింతన మట్లే యొనర్చబడవలయును. పరమేశ్వరుని గుణముల చింతన మొనర్చుచు ఆ గుణిని ధ్యానించవలయును. నేత్రములు మొదలగు ఇంద్రియముల తృప్తికొరకు మాత్రవే మూర్తులు మున్నగువాని అవసరముండునేమో కాని, ఆత్మద్వారా పరమాత్మ యనుభూతిని పొందుటకు మాత్రము ఆకృతుల యవసరము లేదు.

7. ప్ర. వీణ : మూర్తిపూజ ప్రారంభ సోపానమనియు, అభ్యాసమైన పిదప సాధకుడు నిరాకారుడగు పరమేశ్వరునే ఉపాసించగలడనియు కొందరనునది సత్యము గాదా?

ఉ : సాధన కొరకు మూర్తిపూజ సాధకునకు సాధకము గాక బాధకమే యగును. మూర్తి పూజకుడు జీవితమంతయును ప్రతిమల పూజలనే చేయుచు అంతకన్న ముందుకు సాగలేడు. 'సోపానము'లను దాని భావము యమనియమములు. అనగా, "అహింస, సత్యము, అస్తేయము (చౌర్యము చేయకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (నిధుల సంగ్రహవృత్తి లేకుండుట) అను నీ యైదును యమములు; "శౌచము, సంతోషము, తపము,

స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అను నీ యైదును నియమములు. వీనిని అభ్యసించుచుండవలెను. "యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధు" లనునవి ఈశ్వరోపాసనకు, ఆతని సాక్షాత్కారమునకు సర్వోత్తమమైన వాస్తవ సోపానములు. యోగ దర్శనమునందు వీని వర్ణన అతి విపులముగ గలదు. శాస్త్రోక్తమైన, యోగీశ్వరుల అనుభవసిద్ధమైన ఈ యోగము ఈశ్వర సాక్షాత్కారమునకు అత్యుత్తమమైన మార్గము. మిగతావన్నియు మానవుల మిథ్యాకల్పనలే. మన పూర్వులగు ఋషులు, మహర్షు లెల్లరును ధ్యానావస్థితులై సాధన చేయుచుండిరి. కాని మూర్తిపూజలు చేయలేదని మన ప్రాచీన శాస్త్రాదుల, ఇతిహాస సాహిత్యముల వల్ల స్పష్టమగుచున్నది.

8. ప్ర. వీణ : పరమేశ్వరుడు మూర్తులందును వ్యాపకమై యున్నాడు గదా! విగ్రహారాధన, విగ్రహోపాసనల నొనర్చుట వల్ల పరమాత్ముని పూజ, ఉపాసనలు జరిగినట్లేల విశ్వసించరాదు?

ఉ : పరమాత్మ సర్వవ్యాపకుడగు కారణమున విగ్రహము లందును వ్యాపకుడై యున్నాడనుట యథార్థమే. ఐనను, మూర్తులందు జీవాత్మ పరమాత్మల సంయోగము సంభవము గాదు. జీవాత్మ పరమాత్మలు ఒకచోట ఉన్న స్థలమునకే కలిసికొనుట సంభవమగును. మూర్తియందు పరమాత్ముడున్నాడు. కాని జీవాత్మ మన శరీరములందు బంధితుడై యున్నందున విగ్రహములందు వ్యాపకుడై యున్న పరమాత్ముని పొందుటకు అచ్చటికి చేరజాలడు. దీని కొరకు ఉపాసకుని శరీరమే ఉత్తమ స్థానము. దీనియందు జీవాత్మ పరమాత్మలిరువురును వ్యాప్య, వ్యాపక రూపమున ఎల్లప్పుడును విద్యమానమై యున్నందున జీవాత్మ ధ్యానావస్థితుడై తన ప్రభువును యథేచ్ఛగా గలిసికొనగలడు.

చూడమ్మాయీ! 'దూర' మనునది మూడు విధములుగా నుండును. 1. దేశ దూరము, 2. కాల దూరము, 3. జ్ఞాన దూరము. జీవాత్మ పరమాత్మలు కలిసియే యున్నందువల్ల ఈ యిరువురి మధ్య దేశదూర మనునది లేనేలేదు. కాల దూరము కూడా లేదు. ఏలయన, పరమాత్మ ఒకప్పుడుండెను. ఇప్పుడున్నాడు. ముందుకు రాగల డను మాటయే లేదు గదా! అతడు అన్ని కాలములందును

వర్తమానుడై యుండును. ఇక దూరమనునది కేవలము జ్ఞాన దూరము మాత్రమే. మానవుడు తనయందే సదావ్యాపకుడై యున్న సత్తాయొక్క అనుభూతిని పొందు ప్రయత్నమే చేయడు. వాస్తవిక విజ్ఞానముద్వారా అజ్ఞానమును దొలగించుకొని పరమాత్మ నన్వేషించు ఉపాసకునికి పిపాసకుడు జల భ్రాంతితో మృగతృష్ణల లోబడి తిరుగునట్లు కొట్టుకు తిరుగుట వంటివి యుండవు. "పరమాత్మతో కలిపెద"మను పేరుతో నడుపబడుచున్న ఈ దుకాణములన్నియు మూతబడిపోగలవు.

9. ప్ర. వీణ : పరమేశ్వరుడు నిరాకారుడై యుండినను సమయానుకూలముగ సాకారుడుగ అవతార మెత్తగలడు గదా?

ఉ : బిడ్డా! ఈశ్వరు డనాది గదా! ఆతని గుణములు కూడ అనాదియే. నిరాకారత్వము పరమాత్ముని నిత్య అనాది గుణము. పరివర్తన గుణములు గల గుణి లేక పదార్థము నాశనమగుచుండును. ఈ సంపూర్ణాకాశమును ఎవ్వరైన ఒకచో కూర్చి, మడత చేసి ఒక కుండలో బంధించగలరా? అట్లు చేయలేనప్పుడు విశ్వవ్యాపి యగు పరమాత్మ ఏక దేశము, అత్యల్పమునైన మానవ శరీరమందు జేరగలడా? ఏక దేశీయ పదార్థములందే 'రాకపోకలు' అనునవి జరుగుచుండును. కాని సదా సర్వవ్యాపకుడై యున్న భగవంతుని రాకపోకలు, అవతారములు ఎట్లు సంభవము? నీ విచ్చట నున్నప్పుడు మరొక చోట నుండజాలవు. ఇంకెచ్చటనో ఉన్నప్పుడు ఇచ్చట నుండలేవు. ఇదే విధముగా పరమాత్మ అవతారమెత్తి ఒక్కచోటికి చేరినచో విశ్వమందలి ఇతర స్థలము లందెచ్చటను ఉండజాలడు. అట్లగుచో అతడు సర్వాధారుడు, సర్వవ్యాపకు డెట్లగును? మరొక విషయము - నిర్మాణముకన్న వినాశమే సులభముగ జరుగును. ఏదేని యొక నిర్మాణము జరుగునప్పుడు దానికి వ్యయమగునంత శక్తి దాని నిర్మూలనమున కవసరముండదు. విశ్వాధారుడు, సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు చేయలేని పని యేదైన గలదా? రావణుడు, కంసుడు మొదలగు తుచ్ఛ మానవులను వారి హృదయగతి నాపివేసి చంపివేయజాలడా? వారిని చంపుటకు జన్మముల నెత్తవలసివచ్చునా? వారెల్లరును జన్మతః తమ పూర్వజన్మ

కర్మ ఫలయోగము ముగియగనే స్వయముగ మరణింతురు గదా? ఈ కారణమున 'అవతారము లెత్తుట' యను మాట స్వయముగనే వ్యర్థమగుచున్నది. తుచ్ఛుడగు ఒక మానవుని చంపుట యనునది ఈ యనంత విశ్వసృష్టి, స్థితి, లయముల నొనర్చగల మహాప్రభువునకు కఠినమైన విషయమా?

10. ప్ర. వీణ : అమ్మా! నిరాకారుడగు పరమేశ్వరుడు శరీరము, ఇతర అవయవాది సాధనములు లేకుండా ఈ సృష్టి నెట్లు నిర్మించినాడు?

ఉ : బిడ్డా! జగన్నిర్మాణమునకు పూర్వమే నిర్మాణమునకు ఉపాదాన సామగ్రి పరమాణు రూపమున శూన్యాకాశమందు విద్యమానమై యుండెను. ఇట్టి పరమాణువులను స్థూలమగు ఎట్టి హస్తములతోనైనను పట్టుకొనుటకు సాధ్యము గాదు. పరమేశ్వరుడు సూక్ష్మాతి సూక్ష్ముడగు కారణమున పరమాణువులందును వ్యాపకుడై యుండి వానియందు చలనమును గలిగించినాడు. ప్రప్రథమున పరమాణువులు ఆకాశములో చేరి పోగైనప్పుడు అవకాశ రూపాకాశము ఉత్పత్తియైనది. దాని తరువాత వాయువు, దానినుండి అగ్ని, అగ్ని తరువాత జలము ఉత్పన్నమైనవి. ఆ పిదప పార్థివ స్థూలపరమాణువులై క్రమముగా పృథివ్యాధుల ఉత్పత్తి జరిగినది. ఏ యితర సాధనముల సహాయము లేకనే పరమేశ్వరుడు మాతృ గర్భమున సకలావయవ సంపన్నమగు శిశువు నుత్పన్న మొనర్చినట్లే తన సర్వవ్యాపకత్వము వల్ల ఏ అవయవములు, సాధనములు లేకయే జడ పదార్థముల యుత్పత్తి, వికాసములను చూచుచుండియును ఈ సృష్టి యుత్పత్తి విషయములో నీకు సందేహమెందుకు గలిగినది?

11. ప్ర. హంస : ఈశ్వర స్తుతి, ప్రార్థన, ఉపాసనాదు లొనర్చినందువల్ల అతని పొగడ్త, ముఖస్తుతి యొనర్చినట్లగును గదా! దానిచే లాభమేమని కొందరందురు. మీ యుద్దేశ్యమేమి?

ఉ : ఈశ్వరుడీ విశ్వమును సర్వపరిపూర్ణముగా సృష్టించినాడు. ఆతడు మనకు స్వామి, సఖుడు, సర్వస్వమునై యున్నాడు. మన మేలు కొరకే యాతడు సూర్య, చంద్ర, వాయు, జల, అన్నౌషధ, కందమూల ఫల పుష్పాది సకల పదార్థముల

నుత్పన్న మొనర్చినాడు. ఆపదల నుండి అతడే మనలను కాపాడుచుండును. మనకు మన కర్మానుసారము ఫలముల నిచ్చుచుండును. ఇంతటి మహోన్నతమైన ఉపకారి యొక్క అనేక ఉపకారములతో మనము యావజ్జీవము లాభము నొందుచున్నాము. అట్టిచో అతని స్తుతి ప్రార్థన ఉపాసన చేయకుండుట కృతఘ్నత గాక మరేమగును?

'స్తుతి' యనగా పరమాత్ముని గుణములను, ఉపకారములను ప్రేమపూర్వక శ్రద్ధతో వర్ణించుచు స్మరించుచుండుటయే. ఇందువల్ల మనకు పరమాత్మునిపై ప్రీతి, ఆకర్షణ లుత్పన్నమగును. సాధకుడు తన్మయుడైనప్పుడు పరమాత్మునకు, తనకు మధ్య ఏమాత్రము అంతరము లేనట్లు అనుభూతిని పొందగలడు. ఏకాగ్రత యొక్క ఈ స్థితివల్ల జీవాత్మయందు పరమేశ్వరుని ఈ దివ్య గుణములు వచ్చి చేరుచుండును. ఉపాసన యనగా సమీపమునకు చేరుట. అగ్ని సామీప్యమున ఉష్ణము, సజ్జనుని సామీప్యముచే సద్గుణములు, దుష్టుని సామీప్యము వల్ల జీవనమున దుర్గుణములు ప్రవేశించినట్లే పరమాత్ముని ఉపాసన వల్ల జీవనమున సద్గుణములు ప్రవేశించును. సాధకుని యాత్మ బలము, శక్తి, నిర్భయత, పవిత్రత, స్ఫూర్తి, జ్ఞానము మొదలగు ఉత్తమ గుణములచే పూర్ణమగును. ఉపాసన వల్ల ఆతని మస్తిష్కమున వికాసము వంటి అనేక సద్గుణములు ప్రాప్తించును. క్రమముగ నాతని ప్రార్థనకు స్థిర రూపము వచ్చును.

ప్రార్థన యనగా వేడుట, యాచించుట. యాచించుట వల్ల సాధకుని యందుండు గర్వము, ఆత్మాభిమానము దొలగిపోయి దాని స్థానమున నమ్రత వచ్చి చేరును. ఇట్లు స్తుతి, ప్రార్థన, ఉపాసన యను నీ మూడును మానవునకు ఆత్మకల్యాణ సాధనములే. దీనిని పొగడ్త, ముఖస్తుతి యనుట అజ్ఞానము గాక మరేమగును? పరమాత్ముని యుపకారములను స్మరించక విస్మరించువాడు కృతఘ్నతా దోషము గలవాడగును. ఈ స్తుతి ప్రార్థనోపాసనలు ఏకాంతమున శుద్ధ శాంత స్థలమున జేసికొనవలయును. సద్ హృదయముతో జేయబడు ప్రార్థనను పరమాత్ముడు అవశ్యముగా సఫల మొనర్చును.

12. ప్ర. హంస : 'సర్వశక్తిమంతు'డనుట కర్థమేమి?

ఉ : తానొనర్చు సకల కార్యములందు ఇతరుల సహాయము నాశించని వానిని 'సర్వ శక్తిమంతు'డని యనెదరు. ఇంతేగాక విశ్వమందలి శక్తులన్నియును పరమేశ్వరునిలో నున్నందునను ఆతని 'సర్వ శక్తిమంతు'డని యందుము.

13. ప్ర. వీణ : యజుర్వేదములో **"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"** (య. 31–35) అనగా "ప్రపంచము పరమాత్మ యొక్క ఒక భాగముననే యున్నది. మిగతా మూడు భాగములు ఆతని నాశరహిత ప్రకాశ స్వరూపము" అని యుండుటవల్ల పరమాత్ముని కొక సీమ యున్నట్లే గదా?

ఉ : ఈ విశ్వము అనంతమని విజ్ఞానము వల్ల స్పష్టమైనది. లోక లోకాంతరముల సంఖ్యయును అసంఖ్యాకమైనదే. అనంత సూర్య గోళములు, నక్షత్రములు విశ్వమంతటను నిండియున్నవి. మిగిలిన యాకాశమును సీమరహిత (అనంత)మే యైయున్నందున పరమాత్ముడును అనాది, అనంతుడు, స్వయం సిద్ధుడనై యున్నాడు. వేద మంత్రమున పాదమున కర్థము అంశము. అనగా సంపూర్ణము, అనంతమునైన కార్యరూప జగత్తు పరమేశ్వరుని ఒక అంశమునందు మాత్రమే స్థితమై యున్నది. మిగిలిన ఆకాశ భాగముకూడా పరమాత్మ యందే వ్యాప్తమై యున్నది. అది పరమేశ్వరుని మాహాత్మ్యమునకు నిదర్శనము. పరమాత్ముడు అమృత స్వరూపుడు, ప్రకాశ స్వరూపుడు. ఆతని మాహాత్మ్యము అసీమితము, అనంతమునై యున్నది. అనంతమున వ్యాప్తుడై యున్నందున ఆతడును అనంతుడే.

14. ప్ర. హంస : అమ్మా! మా విద్యాలయమున కొక శాస్త్రిగారు వచ్చి తన ప్రవచనమున "వేదములందు పరమాత్ముడు అవతారము లెత్తినట్లు వ్రాసియున్న"దని చెప్పి యజుర్వేదమందలి ఈ మంత్రములను వినిపించినారు.

**ఓం ప్రజాపతి శ్చరతి గర్భే అన్తరజాయమానో బహుధా వి జాయతే ।**

**తస్య యోనిం పరి పశ్యన్తి ధీరా స్తస్మిన్ హ తస్థు ర్భువనాని విశ్వా ॥**

- యజుర్వేదము (31-16)

**ఓం ఏషో హ దేవః ప్రదిశో ను సర్వాః పూర్వో హ జాతః స ఉ గర్భే అన్తః ।**

**స ఏవ జాతః స జనిష్యమాణః ప్రత్యఙ్ జనాస్తిష్ఠతి సర్వతో ముఖః ॥**

యజుర్వేదము (32-4)

ఈ వేద మంత్రముల యాధారమున పరమాత్ముడు గర్భమునకు వచ్చునని, జన్మమెత్తునని తెలిపినారు. మీ యుద్దేశ్య మేమి?

ఉ : బిడ్డా! శాస్త్రిగారు ఈ వేద మంత్రముల యొక్క అర్థమును తప్పుగా తెలిపినారు. ఇందు మొదటి మంత్రము యొక్క అర్థమేమన : "పరమాత్మ (గర్భే అన్తః) అంతఃకరణ మధ్యమున అనేక విధములుగ ప్రకటితమగును. యోగి సమాధ్యవస్థయందు పరమేశ్వరుని యానంద రూపము యొక్క అనుభూతిని తన అంతఃకరణమున పొందును. విద్వజ్జులు ఆతని (యోనిమ్) స్వరూపమును కార్యరూప సృష్టిని అనేక రూపములలో గాంచుచు అనుభూతిని పొందుచుందురు. ఈ విశ్వమంతయు నాతనియందే స్థితమైయున్నది.

ఈ వేద మంత్రమున 'ధీరాః' అను పదమే పరమేశ్వరు డెప్పుడును సాకారుడగుట, అవతారమెత్తుట, గర్భమునకు వచ్చుట జరుగదని చెప్పుచున్నది. అవతారమునకు వచ్చినచో సకలజను లాతని చూచియుందురు గదా! వేదమున నాతని స్వరూపమును కేవలము 'ధీరాః' అనగా "యోగులు మాత్రమే చూతురు, అనుభూతి నొందెద"రని యున్నది. ఈ వేద మంత్రము వల్ల ఈశ్వరావతారము సిద్ధించుట లేదు. రెండవ మంత్రము నందిట్లే "పరమాత్మ సకల దిశలందు, ఉపదిశ లందును వ్యాపకుడై యుండి కార్యరూప జగత్తును సృష్టించి కర్తగ తన్ను ప్రకటించుకొన్నను, ఆ పరమాత్ముడే (గర్భే అన్తః) యోగుల అంతఃకరణ మధ్యమున అనుభవమునకు వచ్చును. గడచిన, రాబోవు కల్పములందును ఆతడు తన నీ విధముగనే ప్రకటించుకొనుచుండును. ఆ పరమాత్ముడే ప్రతి పదార్థము నందును స్థిరుడై, స్థితుడై, అచలుడై, విద్యమానుడై యున్నాడు" అని

యున్నది.

ఈ రెండు వేద మంత్రములందును (గర్భే అన్తః) అను పదముల అర్థము "గర్భమునకు వచ్చుట" యని గాదు. అంతఃకరణ మధ్యమున ప్రకటమగుటయే అగును. వేదమునం దే మంత్రమునందును ఈశ్వరావతారము సమర్థించ బడలేదు.

15. ప్ర. వీణ : ఏ పదార్థమునైనను, ఏ మూర్తినైనను పరమేశ్వరునిగా భావించి ఆతని యుపాసన ఏ రూపమున చేసినను పరమాత్మ అదే రూపమున ప్రత్యక్షము కాగలడు. కావున భావన చేయుటయును మిథ్యయేనా? అని కొందరందురు. మీ యభిప్రాయమేమి?

ఉ : ఏ పదార్థ మెట్లుండునో దానియందదే భావన గలిగి యుండుట సత్యభావన యగును. అందుకు విపరీతమగు భావన మిథ్యయే యగును. బెల్లమును బెల్లముగా భావించిన అది సత్యభావన యగును. విషము నందమృత భావన గలిగియున్న నది మిథ్యభావన యగును. ఇదే విధముగ పరమాత్మయందు ఆతని గుణకర్మ స్వభావాది గుణముల కనుగుణముగ భావన యొనర్చిన సరిగా నుండగలదు. పరమాత్మయందు తన పుత్రభావన, జడమునందు చైతన్య భావన, చైతన్యము నందు జడభావన, మూర్ఖుని యందు పాండిత్య భావన మున్నగున వన్నియును మిథ్యయే యగును. పరమాత్మ నిత్యుడు, నిరాకారుడు, అట్టిచో ఆతనియందు సాకార భావన నొనర్చుట, పాషాణ ప్రతిమయందు పరమాత్మ భావన జేసి దానినుండి సౌఖ్యములు, ధనధాన్యములు పుత్రాదులను కాంక్షించుట మిథ్యభావన యగునే కాని లాభమేమాత్రము నుండదు. ఏలయున, జడమూర్తులందు కోరికలను ప్రసాదించు శక్తి నుండజాలదు.

16. ప్ర. వీణ : పరమేశ్వరుని న్యాయకారి, దయాళువని యందురు గదా? ఈ రెండు గుణము లొక్కచోట ఎట్లుండగలవు? ఒకవేళ ఆతడు అత్యాచారుల యెడ దయగలిగి యుండిన న్యాయకారి యెట్లగును? ఇక న్యాయకారి యైనచో దయాళువు కాదు గదా?

ఉ : న్యాయము, దయ అను వానియందు కేవలము శాబ్దిక భేదమే గాని, అర్థభేదమేమియును లేదు. కర్మానుసారము యథావిధిగ దండించిన నది న్యాయమేయగును. అట్టి దండన ద్వారా ప్రాణిని పాపకర్మల ప్రవృత్తి నుండి కాపాడి ఆతనిని సంస్కరించుట, ఆతనికి ఉత్తమ కార్యము లొనర్చుట కవకాశమును గలిగించుట, అట్టి దండము ద్వారా ఆతని యత్యాచారముల నుండి ఇతరులను గాపాడుటయును దయయే యగును. న్యాయాధీశుడు శిక్ష విధించుటలో ఆతని యుద్దేశ్యము జీవులకు, దోషులకు హితము గలిగించుటయే యగును. దీని నొక దృష్టాంతము ద్వారా తెలుపుదును -

ఒక రైతు భూమి యందొక విత్తనము వేసి నీరు పోయును. దానినుండి ఒక వృక్షము పెరిగి పెద్దదై ఏటా అతి విలువైన వేలాది ఫలముల నిచ్చుటయే యా రైతు కష్టమునకు దగిన ఫలములనిచ్చుట యగును. ఇది న్యాయము. అట్లే రవి చంద్రులను, వర్ష గ్రీష్మ శీతాది ఋతువుల్లను గల్పించి జీవులకు మేలు చేకూర్చుట ఈశ్వరుని దయకు ఒక ప్రత్యక్ష దృష్టాంతము. ఈ విధముగ ఈశ్వరుని విషయమున న్యాయము, దయ యనునవి సమానార్థకములే.

17. ప్ర. హంస : "సృష్టి నిర్మాణము జరుగుటకు పూర్వము కేవలము పరమాత్మయే విద్యమానమై యుండెను. మరేమియు లేకుండెను. పరమాత్మయే జీవాత్మలను, సృష్టి నిర్మాణమున కవసరమగు సామగ్రిని ఉత్పన్న మొనర్చినా"డని కొందరనుట ఎంతవరకు వాస్తవము?

ఉ : ఏ మాత్రము వాస్తవము గాదు. పరమాత్మ, జీవాత్మ, ప్రకృతియను నీ మూడును అనాది వస్తువులు. ప్రకృతి జగత్తున కుపాదాన కారణము. పరమాత్మ ప్రకృతితో జగత్తును జీవాత్మ కొరకు సృజించినాడు. మట్టి పూర్వము నుండియే లేకున్నచో కుమ్మరి కుండను నిర్మింపజాలడు. కార్యమునకై ఉపాదాన కారణము పూర్వమునుండియే యుండు టవసరము. జగన్నిర్మాణమునకు పూర్వమే అందుకవసరమగు సామగ్రి పరమాణు రూపమున ఉండియుండెను. అట్టి ృతి పేరే ప్రకృతి. అభావము నుండి భావ ముత్పన్నము గాజాలదు. ఒకవేళ

పరమాత్మ ద్వార జీవాత్మల యుత్పత్తి యగుచో వాని పూర్ణ వినాశము గూడ సంభవమై యుండును. ఉత్పత్తి యగుదాని వినాశము తప్పక జరుగును. **"జాతస్య మరణం ధ్రువమ్, జాతస్య హి ధ్రువో మృత్యుః" "యద్దృశ్యం తన్న శ్యతి"** మళ్ళీ మొదటి ప్రశ్నయే. అనగా **"పరమాత్మ జీవాత్మలను దేనితో ఎందుల కుత్పన్న మొనర్చినా"**దను సంశయము కలుగును. ఈ జటిల ప్రశ్నకు సమాధానము కేవలము వైదిక ధర్మము గాక ఇతర మతముల, సాంప్రదాయముల ద్వారా సంభవము గాదు.

పూర్వము నుండియే ఏదో చైతన్య శక్తి (సత్తా) విద్యమానమై యుండకున్నచో పరమాత్ము డీ జగత్తును, జీవాత్మలను తన కొరకే సృష్టించుకొనినాడా? అట్లే అని నమ్మినచో పరమాత్మ అపూర్ణుడగును. ఏల యన, అవసరములు అపూర్ణునకే యుండును. కాని పరమాత్మ పరిపూర్ణుడు. ఆతడు జగత్తును జీవాత్మల హితమునకే ఉత్పత్తి యొనర్చినాడని నమ్మవలసియే యుండును. ఇట్లు నమ్ముటచే గలుగు మాన్యత నిర్దోషముగ నుండును. ఏల యన, ఈ జగత్ప్రవాహము అనాది. ఒక నిశ్చితావధియందు జగద్రచన చేయుచుండును.

18. ప్ర. వీణ : పరమాత్ము డీ ప్రపంచమును మాటిమాటికి సృష్టించుచు ప్రళయ మొనర్చుచుండుట కంటె సదా నాశము చెందకుండ నుండు ప్రపంచమును సృష్టించినచో ఏ బాదరబందీ లేకుండా నిశ్చింతగ నుండును గదా? అట్లేల జేయడు?

ఉ : చూడమ్మా ! నిర్మింపబడిన ప్రతి పదార్థము గూడా నిశ్చితావధి తరువాత నిశ్చయముగ నాశమగుచుండును. గృహములు, కుండలు, ప్రాణులు, వృక్షములు మున్నగునవన్నియు ఉత్పన్నమై నష్టమగుచున్నవి. దీని కారణ మేమన - పరమాణువుల సంయోగము వల్ల ఉత్పన్నమగు వస్తువులు ఒక నిశ్చిత సమయము వరకుండు సామర్థ్యము గలిగియుండును. పిదప వానియందు విఘటన క్రియ ప్రారంభమగును. క్రమముగ కాలాంతరమున నవి సంపూర్ణముగ నష్టమైపోవును. ఇదే విధముగ పృథివీ మున్నగు లోకములు ఏ పరమాణువులతో సిద్ధమైనవో వాని యందెంత కాలము వరకు స్థిరముగ నుండు సామర్థ్యముండునో

అంతవర కా లోకములు స్థిరముగ నుండి ఎట్లెట్లు సమయము గడచుచుండునో వాని ఆ రూపమున నుండు శక్తి క్షీణించుచుండును. కాలాంతరమున పృథివిపై ఏ ప్రాణియును, ఏ వనస్పతియును జీవించి యుండని సమయము వచ్చి పృథివి యొక్క ప్రతి అవయవమును విఘటన మగుచుండును. అప్పుడు పరమాత్మ పృథివి యొక్క ప్రతి పరమాణువును విడదీసి పూర్తి ప్రళయము నొనర్చును. మానవుడు పనులు చేసి చేసి సంపూర్ణముగ అలసిపోయినప్పుడు విశ్రాంతిని గోరి నిదురించునని మీరెరుగుదురు గదా! నిదురించునప్పుడు శరీరము కోల్పోయిన శక్తిని మరల సంపాదించుకొనును. మనుష్యుడు పూర్ణ స్వాస్థ్యమును పొందును. ఇదేవిధముగ పంటభూమి ఉత్పాదన శక్తి కొంతకాలమునకు క్షీణించును. అప్పుడు రైతు ఆ భూమిని కొంతకాలము సేద్యము చేయక బీడుగ విడుచును. తరువాత ఆ భూమి తిరిగి పంటనుత్పత్తి చేయు శక్తి గలిగిన దగును. పృథివి జీవనకాల పరిమితి నాలు గర్బుదముల ముప్పది రెండు కోట్ల సంవత్సరములు. ప్రళయ కాలమున పరమాణువులు అంతేకాలము వరకు ఆకాశమున విస్తరించి యుండును. అప్పుడు వానియందు మళ్ళీ పృథివిరూపమున సంఘటనమగు శక్తి వచ్చును. ఈ నాలు గర్బుదముల ముప్పది రెండు కోట్ల సంవత్సరముల ప్రళయ కాలానంతరము పరమేశ్వరుడు పునః జీవుల కొరకు సృష్టి రచన నారంభించును. పృథివి అంతమగునప్పుడు కర్మఫలముల భోగ శేషము మిగిలియున్న జీవులకు క్రొత్త సృష్టియందు జన్మనిచ్చి వారికి పురుషార్థముల నొనర్చు అవకాశము గలిగించును. ఈ ప్రకారముగ సృష్టి ప్రళయముల ఈ క్రమము అనాది కాలమునుండి వచ్చుచున్నది. అనంత కాలము వరకు నడచుచునే యుండగలదు. సృష్టి, ఉత్పత్తి, ప్రళయముల రహస్య మిదియే.

19. ప్ర. హంస : ఈ జగత్తు మరియు సృష్టి అనాది. దీని నెవ్వరును ఎప్పుడును చేయలేదు. అనాదినుండి యున్నది. ఉండగలదు. దీనియందు బాహ్య పరివర్తనము గలుగుచుండును. సంపూర్ణ సృష్టి మరియు జగత్తు ఎప్పుడును వినాశము నొందదని కొందరందురు. మీరేమందురు?

ఉ : ఇట్లు విశ్వసించు వారి యాలోచనలు శుద్ధమైనవి గావు. 'జగత్తు' అను పదమున కర్థమిట్లు గలదు. జ. ఉత్పన్నమగునది, గత్ - నాశనమగునది - అనగా, ఉత్పన్నమై నష్టమగునది. కావుననే ఈ ప్రపంచమును 'జగత్' అనుచున్నాము. ఇట్లే 'సృష్టి' అను శబ్దమున కర్థము గూడ ఉత్పన్నమగునది. దాని పేరులోనే ఇవన్నియు నుత్పన్నమగునవనియు సిద్ధమగుచున్నప్పుడు ఇక దానిని 'అనాది' అని యెట్లనవచ్చును? 'విశ్వ' శబ్దమునకును వి - వియోగము, శ్వ - భవిష్యత్తులో ఆగునది అని యర్థము. అనగా భవిష్యత్‌లో నష్టమగునది. కావుననే ఈ ప్రపంచమును 'విశ్వ'మని యందుము.

ఇక వినుము - ఏ పదార్థమునందు సంయోగ వియోగము లుండునో దానిని 'కార్యము' లేక 'చేయబడినది' అని యందుము. ఏల యన, రెండు వేర్వేరు పదార్థముల పరమాణువుల సంయోగము ఏదో కాల విశేషమున జరుగును. సంయోగము జరిగినప్పటి ఆ పదార్థము యొక్క ఉత్పత్తి నంగీకరింతుము. ఉత్పత్తి జరిగినప్పుడు దాని వియోగము, వినాశము గూడా ఒకానొకప్పు డవశ్యకముగా జరుగును కదా! జన్మించిన దాని మృత్యువు తప్పక జరుగును. మన మీ విశ్వమందు జూచుచున్న పృథివ్యాది లోకములందు పరమాణువుల సంయోగము స్పష్టముగ నున్నది. దాని యుత్పత్తి జరుగుటయును స్పష్టమే. ఉత్పత్తి జరుగుననుట సిద్ధించినప్పుడు ఎప్పుడో ఒకప్పుడు వాని పూర్ణ వినాశము - ప్రళయము గూడ సిద్ధించును గదా! సూర్య చంద్ర నక్షత్రాది లోకములు గూడ అనాది, అనంతములు గావని స్పష్టమగుచున్నది. మన యీ పృథివి క్రమమింకను వికాసము నొందుచునే యున్నది. శూన్యాకాశము నుండి పార్థివ పరమాణువు లిప్పుడును వేరై పృథివిపై నిరంతరము పడుచునే యున్నవి. అందువల్ల దీని స్థౌల్యము, భారము వృద్ధియగుచునే యున్నవి. పృథివీతలము క్రింద వందలాది గజముల లోతున త్రవ్వునప్పుడు మానవుల మరియు అన్యప్రాణుల అస్థిపంజరములు లభించినవి. ఐతే ఒకానొక కాలమున పృథివీ తలమచ్చట ఉండి యుండెను. అచ్చట దానిపై ప్రాణులు నివసించుచుండెనని స్పష్టమగుచున్నది. కాలాంతరమున భూతలము పైకి పెరుగుచు వచ్చినది.

జీవుల అస్థిపంజరములు ఆ పొరపై నిలిచిపోయినవి. ఇప్పుడు మనము నివసించుచున్న ప్రదేశము గూడ క్రమముగ పృథివితలము పైకి లేచుట వల్ల అడుగున పడిపోగలదు. పృథివి యొక్క ఈ వికాసక్రమము దీని పూర్ణాయువున సగము. అనగా, నాలుగర్బుదముల ముప్పది రెండుకోట్ల యందర్ధ భాగము; అనగా రెండు అర్బుదముల పదహారు కోట్ల సంవత్సరముల వరకు కొనసాగుచునే యుండగలదు. ఇప్పటివరకు దానియందు కేవలము క్రీ.శ. 2012 నాటికి 197,29,49,112 సంవత్సరములు గడచినవి. ఇంకా వికాసక్రమము నడుచుచునే యున్నది. ఈ వికాసక్రమము ఇంకా (234, 70, 50,888) సంవత్సరముల వరకు జరుగుచునే యుండును. ఇది వైదిక సిద్ధాంతము. వేదములు మరియు జ్యోతిషముల ఆధారముగ ఈ గణన సరియైనదే. ఇవి పోపుల మాటలు గావు.

20. ప్ర. హంస : రాత్రివేళ ఆకాశము నుండి తారలు తెగిపడినట్లు గాన్పించుచుండును. అవియేమో తెలుపగలరా?

ఉ : పాక్షిక ప్రళయ కాలమున పృథివి, సూర్య చంద్రాది లోకముల విఘటన మొందిన పిదప వానియందలి అతి కఠోర పాషాణ ధాతు మిశ్రిత కఠినాంశ శిలాఖండములు, శేషించిన అంశములు, పరమాణువులుగ విడిపోకుండ ఉండిన భాగములు, ఉల్కలు మొదలగునవి ఆకాశమున చెల్లాచెదురుగ వ్యాపించిపోవును. ఇక పృథివ్యాది లోకముల నిర్మాణము జరిగినప్పుడు అవియన్నియును ఇతర లోకముల వలె ఆకాశమున భ్రమణ మొనర్చుచుండును. అప్పుడప్పుడవి పరస్పరము ఢీకొనుటచే వానినుండి మెరుపు పుట్టును. దానినే మనము 'చుక్క తెగిపడుట' అని యందుము. ఈ ఢీకొనుటలో ఆ విశాల ఖండములు పూర్తిగా నశించిపోవును. అనేక పర్యాయములు తెగిన భాగాంశము లనేకములు మన పృథివిపై గూడ పడుచుండును. వానియందు ఇనుము, రాగి, శిలలు మున్నగువాని మిశ్రమముండుట చూడబడినది.

21. ప్ర. వీణ : అమ్మా! ఒక శరీరమును వదలిన పిమ్మట జీవాత్మ

కెంతకాలమునకు పునర్జన్మ లభించగలదు?

ఉ : దాని కర్మఫలము ననుసరించి తక్షణము లేక కొన్ని దినములు, నెలలు, సంవత్సరములు లేక ఇంకెంతైన కాలము పట్టవచ్చును. ఈ విషయమున విద్వాంసుల కనేక అభిప్రాయములు గలవు. గర్భమునందు పిండములో కొందరు మూడు మాసములకు, కొందరు ఐదు మాసములకు, మరికొందరు ప్రారంభము నుండియే జీవాత్మ ప్రవేశించుచుండునని తలచుచున్నారు. కాని నా యభిమత మేమన, రజో వీర్యముల జీవిత జీవాణువుల కలయికచే గర్భము నిలుచును. తరువాత మాతా గర్భమున 48 గంటలవర కవి పరిపాకమగును. ఆ పిదప దానినుండి వెంద్రుక వంటి నాళమొకటి యేర్పడి తల్లి శరీరముతో సంబద్ధమై పోవును. అప్పటినుండియే గర్భము (పిండము) మాత శరీరాంశముగ మారును. తల్లియొక్క జీవాత్మ శక్తి దానియందు వ్యాప్తమైపోవును. దానికి తల్లినుండియే ఆహారము లభించును. తల్లి ఆలోచనా ప్రభావములు గూడ గర్భస్థ శిశువుపై బడుచుండును. గర్భమున ప్రాణములుండును. ప్రసవ సమయమున గర్భస్థ శిశువు శరీరము మాతృ శరీరము నుండి విడివడిన తక్షణమే ఏ జీవాత్మ కొరకా శరీరము పరమాత్మచే నిర్మింపబడినదో ఆ జీవాత్మ దానియందు ప్రవేశించును. ఈ విధముగ పిండము ప్రారంభము నుండి సజీవముగనే యుండును. కాని జనన సమయమున అభిమాని జీవాత్మ దానియందు ప్రవేశించును. అనేక వ్యక్తుల మరణము పునర్జన్మమైన పిదప వారి జనన మరణముల సమయము నెరిగిన మీదట ఇట్టి పరిణామమే దృష్టి గోచరమైనది. జీవాత్మ గర్భమునందు ప్రవేశించుట యనునది రూఢి గాజాలదు. పుస్తకము లందేమి వ్రాసియున్నను నేను మాత్రము ప్రత్యక్షమునే ప్రమాణముగ నమ్ముచున్నాను.*

---

* ఇది గ్రంథకర్త వ్యక్తిగత అభిప్రాయము. ప్రాచీన ఆయుర్వేద, మనుస్మృత్యాది గ్రంథములందు గర్భిణీ స్త్రీని 4వ నెలనుండి 'దౌహృది – రెండు హృదయములు గలది" అని సంబోధించిరి. అప్పటి నుండి హృదయ స్పందనలతో బాటు

లోపల పెరుగు బిడ్డ మనస్తత్త్వము, ఇచ్ఛా ద్వేషములు తల్లి మనస్సుపై తన ప్రభావమును చూపించి ఆమె భావములందు, కోరికలందు, కలలయందు మార్పును తీసుకురాగల వనియు, వివేకవతియైన స్త్రీ వాటిని గుర్తించి సంస్కరించ ప్రయత్నించ గలదనియు మన ఋషులు చెప్పిరి. ఆధునిక విజ్ఞానము గూడా దీని నంగీకరించును. బిడ్డ తల్లిగర్భములో నున్నప్పుడే ఎన్నో విషయములు గ్రహించగలుగునని శాస్త్రజ్ఞులు అంగీకరించుచున్నారు. అమెరికన్ తల్లులు మరొక అడుగు ముందుకువేసి తమ గర్భస్థ శిశువులను 'ప్రీ బర్త్ స్కూళ్ళ'లో చేర్పించేస్తున్నారు. అచ్చట కేసెట్లలో నింపిన పాఠాలను స్పీకర్లును నడుముకు కట్టుకొని లోపలి బిడ్డలకు వినిపిస్తున్నారు. ఆ విధముగా గర్భములో పెరిగిన బిడ్డలు తెలివితేటలలో అఖండు లవుతారని ప్రసూత వైద్య నిపుణురాలు డాక్టర్ రానేవన్ డేకర్ అంటున్నారు. మరి గర్భస్థ శిశువులో జీవాత్మ ప్రవేశించకున్న యిది ఎట్లు సాధ్యము? కెనడాకు చెందిన ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు థామస్ వెర్నే రచించిన **'ద సీక్రెట్ ఆఫ్ ద అన్‌బార్న్ ఛైల్డ్'** అనే పరిశోధన గ్రంథంలో మరెన్నో వివరములు కనపడును.

– సంపాదకుడు

---

22. ప్ర. వీణ : మనుష్యుని ఆత్మకు పశు పక్ష్యాదుల యోనులందు రాకపోకలు జరుగుచుండునా?

ఉ : ఔను. కర్మఫల భోగములకై జీవాత్మ విభిన్న యోనులందును జన్మనొందవలసి యుండును. దాని పాపకర్మ లధికమై పుణ్యకర్మలు న్యూనమై యుండునంత వరకు అవశ్యముగ నది అన్య నిమ్న యోనులను పొందు చుండును. ఒకవేళ పుణ్య పాపకర్మలు సమానము లైనను, పాపకర్మల కన్న పుణ్యకర్మ లధికమైనను అది మానవ యోనిని పొందగలుగుచున్నది. ఇది యంతయును దాని పుణ్య పాప కర్మలపై ఆధారపడి యుండును.

23. ప్ర. హంస : విభిన్న యోనులందు జీవులకు జన్మనిచ్చుట వల్ల వాని

సంస్కారము (సుధారణ) ఎట్లు సంభవమగును?

ఉ : జీవాత్మ మానవ శరీరము నందున్నప్పుడు ఏ యింద్రియముల ద్వారా పాపకర్మల నొనర్చుట కలవాటు పడియుండునో అన్య యోనులందట్టి ఇంద్రియములు వాని కీయబడవు. ఏల యన, ఆ యింద్రియములు లభించనందువల్ల జీవాత్మకు అట్టి పాపకర్మములు జేయు అలవాటు నశించును. దాని కా విధముగా సంస్కారము జరుగును. మనుష్యుడు ఇతరులతో దుర్వ్యవహారములు జరిపిన విధముగనే రెండవ జన్మమున దాని ప్రతిఫలము వాని కా పరిస్థితియందే లభించగలదు. ఎట్లన, వాని యంతఃకరణమున గ్లాని యుత్పన్నమగుట వలన కుసంస్కారములు సమసిపోవును.. ఇట్టి వ్యవస్థ ద్వారా ఈశ్వరుడు శుభకర్మల ఫలము శుభము, సన్మానముల రూపమున నొసగును. అశుభ కర్మల ఫలము శిక్ష మరియు అశుభవాసనల వినాశ రూపమున జీవులకిచ్చి వాని యున్నతికి సదవకాశము ప్రసాదించుచుండును.

24. ప్ర. హంస : అన్య యోనులందు జీవులకు పాపపుణ్యముల బంధన ముండగలదా?

ఉ : కేవలము మానవ యోనియే ఉభయ యోనియై యున్నది. దీనియందే జీవులు కర్మ ఫలములను అనుభవించుచు పాపపుణ్య కర్మల నొనర్చుచుందురు. ఏల యంన, మానవునకే వరమాత్ముడు సత్యాసత్యములను, న్యాయాన్యాయములను దెలిసికొని బుద్ధితో కర్మల నొనర్చు అవకాశము నిచ్చియున్నాడు. కర్మానుసారము ధర్మాధర్మముల బంధనములు కేవల మీ జన్మముననే సాధ్యమగును. ఇక మానవేతరములగు యోనులెల్ల కేవలము భోగయోనులే. వానియందు జీవుడు తన మానవ యోని యందొనర్చిన కర్మల ఫలములనే అనుభవించుచుండును. వానిపై ధర్మాధర్మముల బంధనము లుండవు.

25. ప్ర. హంస : "కర్మల ఫలముల నిచ్చుటయందు ఈశ్వరుడేమియును జేయలేదు. గంజాయిని సేవించిన మనుష్యుడు తూలుచు అక్కడక్కడ పడుచు లేచుచు కర్మఫలము ననుభవించునట్లే కర్మల ప్రభావము వల్ల జీవుడు స్వయముగా

విభిన్న యోనులందు ప్రవేశించుచుండు"నని కొందరనునవి యెంతవరకు నిజమో చెప్పుదురా?

ఉ : ఏ వ్యక్తియును నేరము లొనర్చి స్వయముగ జైలునకు పోవుట లేక ఉరిశిక్షను దెచ్చుకొనుటను కోరుకొనడు. ఎల్లరును ప్రత్యక్షముగ శిక్షను తప్పించుకొనుటకే యత్నింతురు. ఐతే అనేక కష్టములకు నిలయమగు నీచ యోనులను స్వయముగా ఎవ్వరు కోరుకుందురు? పరాధీనత వల్లనే దండన లభించును. లభించిన శిక్ష నవి అనుభవించ వలసియే యుండును. "కర్మలే స్వయముగా ఫలముల ననుభవింపజేయు"నని నమ్ముటయును సరియైనది గాదు. ఈ నమ్మకములలో ఇంకొక లోప మేమనగా – అధిక మత్తు అలవాటు గల వానికి కొద్దిపాటి మత్తు ఏమియు జేయలేదు. అనభ్యాసికి కొద్దిపాటి మత్తే అధిక ప్రభావమును గలిగించునట్లే కొద్ది పాపముల నొనర్చిన వారికి సూక్ష్మ (తేలిక) శిక్షయును గొప్పగానే అనుభవము గలుగును. నిజమగు న్యాయమేమన కర్మలమాత్ర ననుసరించి మనుష్యులకు యథాతథముగ న్యాయాధీశుడు దండన విధించునట్లే పరమేశ్వరుడును యథారీతిగ జీవులకు కర్మఫలభోగ వ్యవస్థ నొనర్చుచుండును.

మొదటి దినము, మొదటి యధ్యాయము సమాప్తము.

# ద్వితీయాధ్యాయము

నేడు రెండవ దినము. ప్రాతఃకాలముననే స్నాన సంధ్య యజ్ఞాది కృత్యములను దీర్చుకొని శ్రీమతి అన్నపూర్ణాదేవి తన కూతుళ్ళు వీణాదేవి, హంసవేణిలతో సహా గత దిన నిశ్చయానుసారము స్వాధ్యాయ మందిరమున ఎదురెదురుగ తమ తమ ఆసనములపై గూర్చుండిరి. అప్పుడు తల్లి కూతుళ్ళతో "అమ్మాయిలూ! ఇక మీ సందేహములను ప్రవేశపెట్టు"డని యనగా ఈ దిగువ విధముగా సంభాషణ మారంభమైనది.

26. ప్ర. వీణ : అమ్మా! శరీరమును వదలిన పిమ్మట జీవుని గతి యేమగును?

ఉ : బిడ్డా! జీవుడు శరీరమును వదలివెళ్ళిన తరువాత పాంచ భౌతిక శరీరమున విఘటన క్రియ జరుగుచుండును. కుళ్ళుట మొదలగును. అప్పుడు శీఘ్రాతిశీఘ్రముగా ఆ శవమును శ్మశాన భూమికి గొనిపోయి దానికి దహనక్రియ నొనర్తురు. దీనిని అంత్యేష్టి యందురు. శరీరమును త్యజించి పోయిన జీవాత్మ దాని కర్మానుసారము ఈశ్వర వ్యవస్థానుసారము మళ్ళీ క్రొత్త శరీరమున ప్రవేశపెట్టబడును.

27. ప్ర. వీణ : శవమును దహనమేల చేయవలెను. దానిని భూమిలో పాతిపెట్టుట యందుగల దోషమేమి?

ఉ : మృత శరీరమును భూమియందు పాతిపెట్టుట వల్ల వాయు మండలము, ఆకాశ తత్త్వములు దూషితమై పోవును. భూమిగూడ అశుద్ధమైపోవును. అనేక శవములను పాతిపెట్టుట వల్ల ఎంతో భూమి వ్యర్థముగ గోరీలతో నిండిపోయి నిరుపయోగమై పోవును. అట్లుగాక భూమి ఇతర ప్రజోపయోగ కార్యములందు వినియోగింపబడినచో ప్రజలకెంతో లాభము గలుగును. దహన మొనర్చుట వల్ల శవము కొద్ది సమయముననే దగ్ధమై పంచభూతములందు గలసిపోవును. భస్మము, ఎముకలు పొలములకు ఎరువుగా పనికివచ్చును. దీనివల్ల జలవాయ్వగ్ని భూమ్యాకాశములు దూషితములు గాకుండ నుండును. ఇందువల్ల

ప్రాణులకు నష్టము గలుగకుండ వాయు మండలము పరిశుద్ధముగ నుండును. శవదహన సమయమున ఘృతము, సుగంధిత, ఓషధీకృత సామగ్రి చేత ఆహుతు లిచ్చుచున్నందున శవదహనముచే ఏ మాత్రము దుర్గంధముండు అవకాశ ముండదు. ఈ కారణముననే ఇప్పుడనేక విదేశములందును శవములను దహించుటయే జరుగుచున్నది. ఇదియొక వైజ్ఞానిక ప్రక్రియయునై యున్నది. మన భారతదేశము నందీ మృతక సంస్కారమును అంత్యేష్టి లేక నరమేధ యజ్ఞమనియు అందురు. ఇది మానవ జీవితమందలి షోడశ సంస్కారములందు చివరి పదహారవ ప్రక్రియయై యున్నది.

28. ప్ర. హంస : అనేక జనులు శవములను నదులు మున్నగు జలములందు ప్రవహింపజేయుదురు. దీనియందలి హాని లాభము లేమి? ఇట్లు జేయుట వల్ల జలచర జంతువుల కడుపులు నిండును గదా?

ఉ : జలములందు శవములను ప్రవహింపజేయుట వల్ల అవి కుళ్ళిపోయి దుర్గంధయుక్తమై ప్రాణుల ఆరోగ్యమును పాడుచేయగలవు. జలములనగా జీవనము. అనేక ప్రాణులు జలములను ద్రావి జీవించుచుండును. ఈ దూషిత జలసేవన మొనర్చుట, అందు స్నానాదుల నొనర్చుట మున్నగు వానిచే హానియే గలుగుచుండును. కావున జలములందు శవములను వదులుట పాపకర్మయే యగును.

29. ప్ర. హంస : చిన్నపిల్లల శవములను దహన మొనర్చుటకు మారుగ పాతిపెట్టు ప్రథ ఎందు కేర్పడినది? మహాత్ముల శవములను గూడ సమాధియే చేయుదురేల?

ఉ : ఇదియును అజ్ఞాన కారణముననే జరుగుచున్నది. పిన్న, పెద్దల, సామాన్యుల, మహాపురుషుల శరీరము లన్నియు పాంచభౌతిక నిర్మాణములే. కావున నా యన్నిటికిని దహన సంస్కారమే జరుగవలసి యుండును. ఖనన మొనర్చుట హానికారకము, అవైదిక ప్రథయునగును. ముస్లిములు, క్రైస్తవులు మున్నగు విధర్మీయుల ననుకరించుచు ఆర్య హిందూ సమాజమందును ఈ యవైజ్ఞానిక ప్రథ వ్యాపించుచుండుట శోచనీయము.

30. ప్ర. వీణ : అనేకులు శవములను గంగలో ప్రవహింప జేయుటకు గొనిపోవుదురు. భస్మాస్థికలను గూడ గొనిపోయి గంగా జలమున ప్రవహింప జేయుదురు. దీనివల్ల పుణ్యమేమైన గలుగ గలదా?

ఉ : పుణ్యము మాట దేవుడెరుగును గాని ప్రత్యక్షముగ నిది పాపకార్యమే. ఇట్లు గంగా జలమున ప్రవహింపజేసిన జలము దూషితమే యగును. ప్రజల యందీ అంధ విశ్వాసము వ్యాపించిపోయినది. మహాభారత మందొక శ్లోకము గలదు. చూడుడు -

**"యావదస్థి మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి ।**
**తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥**

మహాభారతం అ.శా. 26-52

అనగా, "మానవుని యెముక లెంతకాలము గంగా జలమున స్థితమై యుండునో అన్ని వేల సంవత్సరముల వరకు అతడు స్వర్గ లోకమున నుండగల"దని మహాభారత కథనము.

ఇట్టి విశ్వాసాధారముల వల్ల మృతక శరీరాస్థికలను గొనిపోయి గంగా జలమున విడుతురు. ఇట్లే నదికి అతి సమీపమున కొలది దూరమున నుండువారు తమ వారి శరీరములను గంగా తీరమున దహన మొనర్తురు లేదా అందు వదలివేయుదురు. కాని యిది యంతయును స్పష్టముగ అంధ విశ్వాసమే. ఎముకలందు భాస్వరము (ఫాస్ఫరస్) ఉండును. కావున వానిని పొలములందు వేయుటవల్ల అధిక లాభము గలుగ గలదు. గంగా జలములందును ఎముకలు కొంత కాలమునకు కరిగిపోవును. కాని అందువల్ల జలములు తప్పక దూషితమగుచునే యుండును.

31. ప్ర. వీణ : అమ్మా ! జీవాత్మ ఒక శరీరమును త్యజించి రెండవ జన్మకు పోవును గదా! లోకులు మరణించిన వారి పేర శ్రాద్ధ తర్పణము లేల యొనర్చెదరు?

ఉ: బిడ్డా! శ్రాద్ధము, తర్పణములను శబ్దముల అర్థములు వేర్వేరుగా నున్నవి. శ్రద్ధాపూర్వకముగా నిచ్చు దానిని శ్రాద్ధమనియు, అట్లు శ్రద్ధాపూర్వకము

నర్పించు దానిని గైకొను నాతడు సంపూర్ణముగ తృప్తి జెందువరకిచ్చు దానిని తర్పణ మనియు అందురు.

చనిపోయిన తరువాత మనము శ్రద్ధాపూర్వకముగా నివ్వదలచిన దానిని తీసికొనుటకు వారుండరు గనుక మరణించిన వారి ఆత్మలను సంతుష్టి పరచలేము. ఇంతేగాక మరణించిన ప్రాణుల యాత్మల ఆచూకి, జాడ, పోబడి కూడ తెలిసిన కదా! మనమేమైన పంపుటకు? కావున శ్రాద్ధ తర్పణములు మరణించిన వారి పేరున ఎంతమాత్రమును జరుగకూడదు. ఇది కేవలము జీవితులై యున్న పితరులకు అనగా పోషకులు, తల్లిదండ్రులు, గురుజనులు, వృద్ధులు, విద్వాంసులు, విశేషజ్ఞులు, వైజ్ఞానికులు, రక్షకులు, పెద్దలు మున్నగువారికి. వారు తృప్తిపడు నంతవరకు శ్రద్ధాపూర్వకముగా సంతృప్తి పరచుటయే శ్రాద్ధము, తర్పణము. తృప్తులైనవారు శ్రాద్ధ తర్పణము లొనర్చు దాతల కల్యాణ కాంక్షతో వారి హితమునకై ఆశీర్వాదముల నిచ్చుచుందురు. కావున జీవించియున్న వారిని శ్రద్ధతో తృప్తిపరచుటయే శ్రాద్ధ తర్పణము లనబడును.

32. ప్ర. హంస: "శ్రాద్ధ సమయమున మృతక పురుషుల ఆత్మలు వచ్చి శ్రాద్ధ భోక్తలగు మా శరీరములందు నిలిచి మాతోబాటు భుజించి తృప్తి నొందునని మన పండితులు చెప్పుచుందురు. అది యెంతవరకు నిజము?

ఉ: అమ్మాయీ! ఆత్మలన్నిటికి పునర్జన్మ లభించును. పండితుల వారు చెప్పినట్లే జరుగుచుండినచో పునర్జన్మ ప్రాప్తించిన లక్షలాది స్త్రీ పురుషులు, బాలబాలికలు, మరణించిన వారెల్లరును పూర్వజన్మ స్థానములకు వెళ్ళుచుండినచో భాద్రపద మాసమున శ్రాద్ధదినములందు లక్షలాది గృహములలో మరణించిన వారి రాక కారణమున లోకము నిండిపోయెడిది. కాని యట్లు జరుగదు. నీ వొకటి రెండు పరీక్షలు గూడ చేసి చూడవచ్చును. పూర్వజన్మ స్మృతిగల ఒక బాలకుని వెదకికొనుము. తరువాత వాని పూర్వ కుటుంబము వారితో శ్రాద్ధము చేయించి అది యా బాలకునికి చేరునా? చూడుము. రెండవది నేనిచ్చటనే కూర్చుండి యుందును. నీవు నా కంచములోని భోజ్య పదార్థముల నితరు లెవరికైనను దినిపించుము. దానివల్ల నా కడుపు నిండగలదా? ఒకడు దినినచో మరొకని

కడుపు నిండజాలదు. పరదేశము నందున్న ఒకని పేర మన యింటియందు పండితులకు దినిపించినచో పరదేశము నందున్నవారికే చేరనప్పుడు పునర్జన్మకు పోయి జాడ తెన్ను తెలియని వారికి శ్రాద్ధ భోజన మెట్లు చేరగలదో నీవే యాలోచించవలెను.

పండితుల వారికి దినిపించబడునట్టి మిష్టాన్నముల వల్ల మృతుల యాత్మలు సంతుష్టి నొందునని కొందరందురు. అది నిజము కాదు. చూడుడు.ఒక తండ్రి తన దుష్టకర్మల కారణమున పందియై జన్మించినాడని అనుకొనుడు. ఇక నాతని పూర్వజన్మ పరివారము పండితుల వారికి హల్వా, పాయసము, లడ్డూలు మున్నగు తినుబండారములను తినిపించినచో ఆ పందికెట్లు తృప్తి కలుగును? పంది తిని తృప్తినొందు వస్తువులను శ్రాద్ధము లందెవ్వరును తినరు. ఇతరులకు తినిపించజాలరు గదా! ఇవి యన్నియును భ్రమ మూలకములు. మృతకశ్రాద్ధ పరంపర ముస్లింల రాజ్యాధికార కాలమున మూడువందల సంవత్సరముల లోపు కాలమునందే ప్రారంభించబడినది. ఇది ప్రాచీన సంప్రదాయము కాదు. ముస్లింలు తమ ప్రేతల పేర్లతో గోరీలపై తినుబండారముల నుంచి 'పాతెహా'ను చదువుచుండిరి. దానినే వీరనుకరించుచు 'శ్రాద్ధ'మను ప్రథను నడిపినారు. ఆదియైనను భాద్రపద మాసమందలి ఒక పక్షమున కేవల మొక్క దినముననే జరుపబడును. మిగతా 364 దినములు శ్రాద్ధము నొనర్చనివారు తమ పితరులను ఆకలి దప్పులతో చచ్చుటకు వదలివేయుదురు. వేసవి గ్రీష్మ ఋతువులందు ప్రచండ ఉష్ణ తాపమున వీరిచ్చట ప్రతి దినము అతి శీతలమగు మంచు, లస్సీ, లెమన్, ఐస్‌క్రీమ్‌లు మున్నగు వానితో తమ తాపము దీర్చుకొనుచు తమ మృత పితరులకు కొన్ని నీళ్ళైనను త్రావించరు. భాద్రపద వర్షరుతువులందు సర్వ ప్రదేశములు జలమయమై మేఘములు జలసమృద్ధములై యున్నప్పుడును తమ పితరులకు రెండు పుడిశిల్ల జలము పోయుట పరిహాసము గాదా! లోకులెట్టి పరిహాసకార్యము లొనర్చుచున్నారో మీరే యాలోచించుడు. శ్రాద్ధమున లభించిన భోజనములు, వస్తువులు మృతాత్మలకు చేరినట్లు పండితుల వారచ్చట నుండి రసీదేమైనా దెచ్చి యిత్తురా? బిడ్డా! ఇవన్నియు అంధవిశ్వాసములు. ముస్లిముల అనుకరణతో

ప్రారంభించబడిన ప్రథలు మాత్రమే. ఇది వైదిక ధర్మము కానేకాదు.

జీవించియున్న మాతా పితరులు మున్నగు పెద్దల నేమాత్రమును సత్కరించక వారి నెంతగానో అవమానపరచి వేళకింత తిండి పెట్టక నానా అగచాట్లకు గురిజేసి మరణించిన పిదప వారి యస్థికలను గంగా జలమున నిమజ్జన మొనర్చి శ్రాద్ధ తర్పణము లొనర్తురు. ఇట్టి వారిపై ఈ క్రింది పద్యము చరితార్థ మగుచున్నది.

**"జియత్ పితా సే దంగదంగా, మరేపితా పహూంచాయే గంగా"**

**"బ్రతికియున్న తలిదండ్రుల బాధలెన్నో బెట్టి వారు**

**చచ్చిన తరువాత గంగ చేర్చుచుండ్రు యస్థికలను"**

బ్రతికియున్న తల్లిదండ్రులు మున్నగు పితరుల నెన్నో బాధలు పెట్టి వారు చచ్చిన తరువాత వారి యస్థికలను గంగలో గలుపుచుందురు.

జీవించి యున్నప్పుడే మాతాపితరులను, గురుజనులను చక్కగా సత్కరించుట సంతానము యొక్క ముఖ్యధర్మము. వారు మరణించిన పిదప యథాశక్తి పరోపకారులు, ధర్మాత్ములునగు వారికి, లోకోపకార ధార్మిక సంస్థలకు యథాశక్తి దానమొనర్చినచో చాల ఉత్తమ కార్యమగును. కాని 'మృతులకు శ్రాద్ధ భోజన'మను పేర డబ్బు నాశన మొనర్చినచో బీదల యెదుట నికృష్టాదర్శమును ప్రవేశ పెట్టినట్లగును.

33. ప్ర. హంస : ఐతే పదినుండి పదమూడవ దినములలో 'పెద్దకర్మ' యను ప్రథ యంతయును నిందనీయమే యగునా?

ఉ. ఔను. ఇదియును "శరీరము త్యజించిన పిదప పదినుండి పదమూడవ దినములందే పునర్జన్మ లభించగల'దను భ్రాంతిపై ఆధార పడియున్నది. కాని యథార్థ మేమనగా, పునర్జన్మ తక్షణమైనా లభించగలదు లేదా వారి కర్మల ననుసరించి కొంత కాలమునకైనను లభించ గలదు. 10-13వ దిన పెద్దకర్మ యను దురాచారము వల్ల మృతుల కుటుంబము వారు ఇంతకాలము దుఃఖమునందే పీడించబడుచుందురు. రెండవది-మృతుల పేర నొసగబడు విందులకు జేయు ఋణము వల్ల వారు పీడితులగుదురు. ఇట్లు విందులు

చేయకున్న లోకు లాతని చెడ్డగా చూచుటయేగాక ఆతని మృత పితరులకు ఆత్మోద్ధరణము గాదనియు నిందింతురు. ఇవన్నియును మిథ్యా నమ్మకములే. తాను జీవితము నందొనర్చిన కర్మలకు మంచియో, చెడ్డయో ఫలము తనకే లభించును కాని ఒకరు చేసిన కర్మలకు ఫలము మరొకరికి లభించదు. సంతానము జేయు మృతక శ్రాద్ధములతో మృతుల యాత్మల సద్గతుల దుర్గతులకు సంబంధ మేమాత్రము నుండదు. ఇంటియందలి స్త్రీలు తల బాదుకొనుచు దుఃఖించుచుందురు. ఇంటిలోపలి భాగముననో, బంగళా పైననో లోకులు హాయిగ పెద్దకర్మ మృతక భోజనమొనర్చుచుందురు. ఇట్టి ఏడ్పులార్పులతో గూడిన భోజన మెట్లు చేయుదుమా? యను సంకోచము గూడ వారి కుండదు. నేటి కాలమున లక్షలాది జ్ఞానవంతులు ఇట్టి పెద్దకర్మ కార్యమును, భోజనాదులను నిషేధించినారు. ఈ దురాచార మెంత శీఘ్రమున దొలగిపోయిన నంత మంచిది.

34. మృతక శ్రాద్ధముల జేయించు పండితులకు కొన్ని ప్రశ్నలు.

1. 'పితరులు' అను నామవాచకము మృతులకు వర్తించునా, జీవితులకా? ఒకవేళ జీవితులకే యగుచో 'మృతకశ్రాద్ధ' మనునది వృథాయే యగును గదా! అట్లుగాక మృతులకు సంబంధించినచో **"ఆధత్తపితరో గర్భం కుమారం పుష్కరస్రజమ్"** (య. 2-33) **"ఊర్జం వహన్తీ రమృతం ఘృతం పయః కీలాలం పరిస్రుతమ్ । స్వధా స్థ తర్పయతమే పితౄన్ ॥"** (య. 2-34), **"ఆయన్తు నః పితరః సోమ్యాసోఽగ్నిష్వాత్తాః పథిభిర్దేవయానైః"** (యజు. 19-58). ఇట్టి వేద మంత్రములలో పితరులు గర్భాధాన మొనర్చుట, అన్న పానీయాదులు సేవించుట, రాకపోకలు, మాట్లాడుట వంటి క్రియ లొనర్చువారలని తెలుపబడినది. ఇట్టి వన్నియును మృతులకు సంభవము గావు. దీనివల్ల 'పితరు'లను నామవాచకము జీవితులకే వర్తించును. కావున మృతులకు శ్రాద్ధము లొనర్చుట అవైదికము.

2. జీవాత్మ గతి స్వకర్మానుసారమే యగుచో మృతక శ్రాద్ధముల అవసరమేమి?

3. జీవాత్మకు లింగభేద ముండనప్పుడు శరీర త్యాగానంతరము వీరిని 'పితరు'లని యనుట ఎట్లు సంభవమగును? ఉపనిషత్తులో జీవాత్మకు

"నైవ స్త్రీ న పుమానేష న చైవాయం నపుంసకః ।

యద్ యచ్ఛరీర మాదత్తే తేన సయుజ్యతే ॥ " (శ్వేతాశ్వతర 5-10).

జీవాత్మకు స్త్రీ పురుష నపుంసక లింగభేదములు లేవు. అది ఏయే శరీరములందు ప్రవేశించునో ఆయా లింగ నామమున పిలువబడును.

4. శరీరానంతరము జీవాత్మకు పితా పుత్రాది లౌకిక సంబంధములు లేకుండా పోవును. కావున వారి పుత్రాదులిచ్చు పదార్థములు వారికెట్లు ప్రాప్తించును?

5. అవివాహితులుగా నుండి మరణించిన వారు పితరులు(పౌరాణిక కల్పనానుసారము మరణించిన తరువాత వారి యాత్మలు) గాని కారణమున వారికి మోక్ష మెట్లు లభించినది? భీష్మ పితామహుని శుకదేవుని వంటివారి గతి ఏమైయుండెను?

6. నిర్వంశీయులగు పితరులు ఆకలి దప్పుల చేతనే మరణింతురా? (ఒకవేళ ఇది నిజమేయైన ఏల?)

7. ఎట్టి జీవులకు పునర్జన్మ యుండును? ఎట్టివారి కుండదు? ఎట్టి వారికి ముక్తి లభించును? దీనిని గుర్తించు సాధనము మీ వద్ద ఏదైన గలదా? అట్లు గుర్తించక శ్రాద్ధాదు లొనర్చుట నిరర్థకమేల గాకూడదు?

8. మరణించిన పిదప స్థూల శరీరము నష్టమై పోవును. సూక్ష్మ శరీరమునకు క్షుత్పిపాసలతో నెట్టి సంబంధ ముండదు. అది భోజనాదులను గ్రహించలేదు. అగుచో మీ పితరులు భోజనము లెట్లొనర్చెదరు?

9. శ్రాద్ధములం దొసగిన భోజనము పునర్జన్మ నెత్తిన జీవుల స్వభావముల కనుగుణ్యమగునది గాకున్నచో శ్రాద్ధ మొనర్చిన నేమి లాభము?

10. ఒక పితరుని నలుగురు కుమారులు నాలుగు వేర్వేరు నగరము లందుండు ఒకే దినమున, ఒకే సమయమున శ్రాద్ధ మొనర్చినచో నాతని నాలుగు స్థానములకు శ్రాద్ధమును గ్రహించుట కెట్లు పోగలదు? ఏల యన, ఏక దేశీయ జీవి ఒకే సమయమునందొకే స్థానమున విద్యమానమై యుండును గదా!

11.సకల జాతుల వారికిని శ్రాద్ధాధికార మేల లేదు?

12. శ్రాద్ధాధికారము లేని జాతుల వారి పితరులు ఆకలి దప్పులచే మరణించుచుందురు. లేదా ఇతరుల పదార్థములను లాగుకొని తినుచుందురు. అట్టి సమయములందు వారికి తగవులు, పోరాటములు జరిగిన వాని నెవరు, ఎట్లు శాంతపరచెదరు? మరణించిన తరువాత గూడ జీవులందు ఉచ్చ నీచ భేదములను పాటించుచుండునని నమ్ముట కాధారమేమి?

13. మరణించిన పిదప చిరునామా గూడ ఉండని జీవాత్మలకు శ్రాద్ధమునందలి వస్తు చయమును పురోహితుడు పితరులకు చేరవేయుటకు ఏదైన ప్రమాణమున్నదా?

14. జాడ గూడ దెలియరాని శరీర రహిత, జీవాత్మల వద్దకు పదార్థముల నందించుటకు నీ వొప్పుకొందువు గదా! మరి సజీవులుగా నుండి పరదేశములందున్న నీ వారి పేరున భోజన పదార్థముల పళ్ళెరము బంపించి వారి ఆకలి దప్పులను దీర్చి వారిని నీవేల సంతృప్తి పరచ జాలవు?

15. పితరులకు, కాకులకు గల సంబంధమేమి? శ్రాద్ధములందు కాకుల కేల భోజన పదార్థములను వేయుదురు? అవి పితరుల ప్రతినిధులని ఎంచుచున్నచో-ఎట్లు?

16. వర్షర్తువు భాద్రపద మాసమున చెరువులు, తటాకములు, నదీనదము లందెల్లడలను నీరు సమృద్ధిగ నిండియుండి మేఘములు జలపూరితములై నిలిచియున్నప్పుడు పితరులకు తర్పణ (జలదాన) ము నొనర్చినందు వల్ల లాభమేమి? జ్యేష్ఠాషాఢ మాసముల గ్రీష్మ ప్రచండతాప కాలమున జలము అత్యంతావశ్యకమై యున్నప్పు డేల తర్పణముల నీయరు?

17. కేవలము సంవత్సరమున నొకే తడవ పితరులకు భోజనమిడి మిగతా కాలమున ఆకలి దప్పులచే జంపుచు తమ పొట్టలు ప్రతిదినము ముప్పూటలు సుష్ఠుగా నింపుకొనుచుండుట తమ గౌరవనీయులగు పెద్దల యెడ అపచారము మరియు నికృష్ట తమమగు ఎగతాళి (పరిహాసము) గాదా! అట్లు గానిచో ఒక తడవ భోజన మొనర్చినచో సంవత్సరము వరకును ఆకలి గానంతగా వారి జీర్ణక్రియ నష్టమై పోయినదా యేమి?

18. మహాభారత అనుశాసన పర్వము అ. 23 నందు "చికిత్సకుని, మందిర పూజారిని, పాల నమ్ముకొను వారిని, గాయత్రీ మంత్ర జపమును, సంధ్యను చేయని వారిని, వేతనము దీసికొని చదివించు బ్రాహ్మణులను శ్రాద్ధములందు నిమంత్రించ వలదని వ్రాయబడి యున్నది. అత్రి స్మృతి 323, 324 వ శ్లోకము లందును జ్యోతిష్కులు పురాణ పాఠకులు నగు బ్రాహ్మణులను యజ్ఞ దానములు మరియు శ్రాద్ధములందు పిలువవలదని, అట్లు పిలుచువాని దానఫలము నష్టమై శ్రాద్ధ మొనర్చిన వారి పితరులు ఘోర నరకములకు చేరగల"రనియును వ్రాయబడియున్నది. దీనికి మీరేమందురు? ఉపరోక్త కర్మ లొనర్చుట, పురాణమును చదువుట మున్నగునవి మహాపాప కర్మలు. అట్లు చేయువారు మహా పాపులని యెంచబడినది. వీరిని శ్రాద్ధాదులందు పిలిచే పాపము శ్రాద్ధకర్త ద్వార యొనర్చబడుచున్నది. ఐతే అట్టి కుకర్మ ఫలము పితరులు ఎందుకు అనుభవించవలసి వచ్చును?

19. గీతా ప్రెస్సు వారి మహాభారత వనపర్వము అ. 183 శ్లో. 77 నందు

**"ఆయుషోఽన్తే ప్రహాదేవ క్షీణప్రాయః కలేబరమ్ ।**
**సంభవత్యేవ యుగపద్ యోనౌ నాస్త్యంతరాభవః ॥**

-మహాభారతం. వనపర్వ. 183-77

అని గలదు. "అనగా, జీవు డొక శరీరమును విడిచి తక్షణమే మరొక శరీరమును గ్రహించును. అతడు స్థూల శరీరాశ్రయము లేక ఒక్క క్షణమైనను ఉండజాలడు" అని వ్రాయబడి యున్నది. గీత 2-22 గూడ జీవుని తక్షణ పునర్జన్మమును బలపరచుచున్నది. అట్లగుచో పునర్జన్మను పొందిన జీవుల కొరకు శ్రాద్ధ మొనర్చుట మిథ్యాకర్మ యేల కాగూడదు? ఏలయన, జన్మించిన బాలకులు, వయస్కు లెవ్వరికిని తమ పూర్వ జన్మ స్థానములం దీయబడుచుండు శ్రాద్ధ పదార్థములు చేరకుండుట ప్రత్యక్షమే గదా!

20. 'పితరులు' అను పేరు జీవాత్మకా? శరీరానికా? అట్లుగాక సజీవ శరీరమునకా? ఒకవేళ జీవాత్మకేయైన మరణించిన తరువాత సంబంధము సమాప్తమై పోవుచున్నది. శరీరముతో సంబంధమున్నచో అదియును భస్మమై

పోవుచున్నది. అట్లుగాక సజీవ శరీరమునకే యగుచో జీవితులు పితరు లగుదురా? లేక మృతులా? జీవితులేయైనచో మృతుల పేర నొనర్చబడు శ్రాద్ధములు నిరర్థకమగును గదా!

21. భవిష్య పురాణము, బ్రాహ్మ పర్వము నందొక శ్లోకమిట్లు గలదు.

**"మృతాన్న మధుమాంసం చ యస్తు భుఞ్జీథ బ్రాహ్మణః ।**
**సత్రీణ్యహాన్యుపవసే దేకాహం చోదకే వసేత్ ॥"**

-భవి. బ్రా. 184-59

అనగా, 'శవనిమిత్త (శ్రాద్ధ) అన్నము, సారాయి, మాంసములను సేవించిన బ్రాహ్మణుడు మూడు దినముల వరకు ఉపవాస ముండి ఒక దినమంతయు జలమందు గూర్చుండి యుండినచో శుద్ధుడగు"నని యున్నది. దీనివల్ల ఏ బ్రాహ్మణుడైనను శ్రాద్ధ భోజనము చేయవలదని స్పష్టమగుచున్నది. ఐతే పౌరాణిక బ్రాహ్మణుడు శ్రాద్ధ భోజనవెునర్చి పై ప్రకారము ప్రాయశ్చిత్త మొనర్చుకొనుచున్నాడా? ❖

❖ విశేష పరిచయమునకై ఆచార్య డా. శ్రీరాం ఆర్య, కాసగంజ్ (ఏటా) ఉ. ప్ర. గారిచే వ్రాయబడిన 'మృతకశ్రాద్ధ ఖండన' మను పుస్తకమును చూడుడు.

35. ప్ర. హంస : భూత ప్రేతములన నేమి?

ఉ. 'భూత' మనగా గడచినది. 'ప్రేత' మనగా 'శవ' మని యర్థము. భూత ప్రేతములను విశేష యోను లేవియును లేవు.

36. ప్ర. హంస : 'మేము భూతములను జూచినాము. వానిని వశపరచుకొనినా' మని అనేకులు చెప్పుదురు. అది యంతయు మిథ్యయేనా?

ఉ. సంపూర్ణముగా మిథ్యయే. నిజముగా కట్టుకథ లందు సత్యమేమియు నుండదు. చతురత గలవారు అమాయకులను భూత ప్రేతాదుల పేరుతో భయపెట్టి వారినుండి ధనమును పొందుచుందురు. అమాయకులు మస్తిష్క వ్యాధులను వ్యాధులని యెంచక భూత ప్రేతాదుల యాక్రమణమని నమ్మి

కూర్చుందురు. ఇట్టి రోగులనేకుల మరణము ఈ భ్రాంతి కారణముననే జరుగుచున్నది. ఆలోచించుడు. జీవాత్మ నిరాకారము, సూక్ష్మమై యుండినను ఇంత గొప్ప స్థూలమైన శక్తిగల శరీర మను సాధనము లేక స్వయముగ నేమియును జేయుటకు సమర్థమైనది గాదు. ఇక నది శరీరమును వదలిన పిమ్మట భౌతిక సాధన (శరీరము) లేక ఏమియును చేయజాలదు. ఎవ్వరితో నేమియును చెప్పజాలదు, పోట్లాడజాలదు. ఒక గడ్డిపోచ నైనను గదల్ప జాలదు. ఇట్టి స్థితి యందది లోకులకు హాని లాభముల నెట్లు గలిగించగలదు?

37. ప్ర. వీణ : కొందరు అంజనము (ప్లేన్ చిట్) మొదలగు వానివల్ల మృతుని యాత్మ వచ్చి మాట్లాడి పోవుచుండునని యనుచుందురు. ఇది మిథ్యయేనా?

ఉ. నే నీ క్రియను స్వయముగ ఆచరించి చూచితిని. ఇందు కార్యము నొనర్చువారు తమ మనఃశక్తితో హస్తాగ్ర భాగములతో ప్రభావితుల నొనర్చి 'అంజనము' వేసి వారి మస్తిష్కము యొక్క చేతనా శక్తిని అంజనము (ప్లేన్ చిట్) ద్వారా ప్రభావిత మొనర్చి పని చేయుచుందురు. ఇందు మరొకచోటి నుండి ఆత్మ వచ్చి పని చేయదు. మనోవిజ్ఞానము యొక్క ఈ రహస్యము నెరుగజాలనివారు భూత ప్రేతాదుల భ్రమయందు బడిపోవుదురు. చిన్ననాటి నుండియే భూత ప్రేతాదుల కల్పిత కథలను వినిపించుచు జననీ జనకులు బాలురను భయపెట్టుచుందురు. అట్టి విషయములే వారి మస్తిష్కములందు స్థిరపడిపోయి చీకటి రాత్రులందెచ్చటనైనను, ఏ కొద్దిపాటి అలికిడి వచ్చినను చిన్ననాడు మస్తిష్కములందు స్థిరపడిపోయిన సంస్కారములు ఉబికివచ్చును. వారికి ఇంటి యందలి వస్తువులు కూడ వారెంచుకొనిన భూతముల వలెనే గాన్పించును. ఆకాశము నందలి మేఘములందు మన కల్పనల రీతిగ, చంద్రగోళమున మనుష్యుని ముఖము వలె రూపములు గనిపించును. అట్లే చెట్లు, వృక్షములు మున్నగు వానియందు భ్రాంతికి వశీభూతమైన మనుష్యుడు మోసపోయి భయభీతుడగును. అప్పుడప్పుడు ఇంటిలో రాత్రి కటిక చీకటియందు ఎలుకల ద్వారా యొనర్చబడు ఖటఖట మను ధ్వనిని విని బాలురు భూత

భయమున వణకిపోవుదురు. స్త్రీలు హిస్టీరియా (మేధః సంబంధ వ్యాధి) తెరల వల్ల మస్తిష్కము, నాడీమండల దౌర్బల్యము, ఉపచేతనా శక్తి యొక్క శోకము, అత్యధిక హర్షము మున్నగు వానివల్ల ప్రభావితులైనందు వల్ల రోగగ్రస్థురాలు చదువుట, ఏడ్చుట, నగుట, ప్రలాపించుట, ఒక్కొక్కప్పుడు ఏదో క్షుద్రదేవత పూనకము వంటి క్రియల నొనర్చుటయే గాక అప్పుడప్పుడు మూర్ఛితురాలగును. దానినిగూడ అమాయక ప్రజలు భూత, ప్రేత, పిశాచ, గ్రహ, దేవీ దేవతల ప్రభావమని నమ్ముదురు. వాస్తవముగా నది రోగమే. ప్రకరణానుసారము వ్యాధి కనుకూలమగు చికిత్స చేయించినచో అది నయమగును. ఇట్లు దేవీ దేవతలను నమ్మకముచే అనేక స్త్రీలు, బాలురు మరణించుచుండుటను మనము చూచుచునే యున్నాము. లోకులు మంత్ర తంత్ర యంత్రములను చేయించి తమ మూర్ఖత్వమున రోగిని చంపివేయుదురు. చతురులగు పూజారులు, ఫకీరులు, మంత్ర తంత్ర వాదులు తమ పొట్ట నింపుకొనుటకు ప్రజల నీ విధముగ భ్రమజాలమునందిరికించి దోచుకొనుచు అనేక విధములుగ హింసించుచున్నారు.

38. ప్ర. వీణ : అమ్మా! అపస్మారము (హిస్టీరియా) అను రోగము అతి క్రూరమైనది. స్త్రీ లననేకులను ఎంతో కాలము నుండి అనేక విధములుగ బాధించి వ్యాకుల పెట్టుట నే నెరుగుదును. పాపమా స్త్రీలకు ఆ వ్యాధి తెరలు రాగానే నిలుచున్నవారు నిలుచున్నట్లే పడిపోవుచుందురు. వంట చేయునప్పుడు కొందరకు తెరలు వచ్చి పొయ్యి నిప్పులలో బడి మరణించినట్లు వినుచున్నాము. ఎంత గొప్ప ఉపచారము లొనర్చినను ఈ వ్యాధి నివారణ గాదు. ఈ రోగమున కిక సరియగు చికిత్సలే లేవా?

ఉ. ఈ వ్యాధి స్త్రీ రోగులకు అతి హానికరము, దుఃఖదాయకమునై యున్నది కొందరు స్త్రీలకు సంతానమైన తరువాత ఈ వ్యాధి స్వయముగనే తొలగి పోవుచున్నది. ప్రతి వైద్యుడును ఈ వ్యాధికి చికిత్స చేయజాలడు. నా అనుభవము నందీ వ్యాధికి ఈ దిగువ ఔషధములు సర్వోత్తమముగా నెంచబడినవి.

'స్మృతిదా' అను పేరు గల ఆయుర్వేద సూదిమందు ప్రతి మూడు దినముల

కొకటి చొప్పున కండరములకు ఇంజక్షన్ చేయించు కొనినచో వ్యాధి నివారణ యగును. బహుశః ఒకటి రెండు సూదుల లోనే లాభము గలుగగలదు.

మరొక ఔషధము : 'సచేతనీవటి' యను ఆయుర్వేద ఔషధము లభించును. అందు పాషాణ భస్మము గూడ చేరియుండును. పిత్త ప్రధాన ప్రకృతిగాని స్త్రీలకు దినమునకు మూడు పర్యాయములు ప్రతి దినము ఇచ్చుచున్న హిస్టీరియా వ్యాధి శీఘ్రముగ నివారణ యగును. ఈ రోగమున కీ యౌషధము అనేకులపై పరీక్షింపబడినది.

39. ప్ర. వీణ: అమ్మా: మీ రిప్పుడీ రోగులకు చక్కని చికిత్సను సూచించితిరి. మహిళా లోకమున కెంతయో మేలు జరుగగలదు. దీని ద్వారా నేను అనేక స్త్రీ రోగులకు లాభము గలుగజేయుదును. కాని **దేవత లనగా నెవరో వివరించగలరా?**

ఉ. 'దేవత' అను దాని యర్థము-'దేవాః' అనగా ఇచ్చువారని అర్థము. దివ్యగుణములు గల చైతన్య వ్యక్తులు, మహా పురుషులు, విద్వాంసులు, దేవతలు. ఇంద్రియములు మరియు అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు మున్నగునవి జడదేవతలు. ఇతరులకు జీవనము, గుణముల నొసగుచు వారి కల్యాణమునకై ఇచ్చునవన్నియును దేవతలే. ఇక నితరులకు హాని గలిగించు వారెల్లరును దుష్టులు, వారే రాక్షసులు. దివ్యగుణములు గల స్త్రీ 'దేవీ' యనబడును.

40. ప్ర. హంస: ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణువు, శివుడు (శంకరుడు) మొదలగు వారెవ్వరు?

ఉ. ఇంద్రుడను శబ్దమునకు మెరుపు, పిడుగు, నాయకుడు మున్నగు అనేక అర్థములు గలవు. కాని పౌరాణికులచే 'దేవత' యని చెప్పబడు ఇంద్రుడు పురాణముల ప్రకారము టిబెట్టు ప్రాంతమునకు చెందిన ఒక రాజపదవి. ఆ రాజ పీఠమున ఆసీనులగు వారెల్లరును 'ఇంద్రు' లనబడుచుండిరి. దేవీ భాగవత పురాణమున-

"స్వర్గ త్రివిష్టో మేరు శిఖరోపరి కల్పితః ।
తచ్ఛస్థానం సురేంద్రస్య నానారత్న విరాజితమ్॥"

-దేవీ భాగవతము 3-13-20

అనగా, హిమాలయ పర్వతములపై టిబెట్టు స్థానమున 'స్వర్గము' కల్పన జేయబడినది. అచ్చటి రాజు 'ఇంద్రు' డనబడును. ఇట్లు 'ఇన్ద్ర' యనగా టిబెట్టు (త్రివిష్టవ) రాజు విశేషణమై యుండెను. 'బ్రహ్మ' యనగా హిమాచల రాజ సింహాసన ఉపాధి (విశేషణమై) యుండెను. 'శివుడు' ఈతని భూతనాథుడనియు అందురు. 'భూత జాతి' యను శబ్దము అపభ్రంశ రూపమున భూతియా లేక భోటియాయైనది. భూతముల స్థానము 'భూతస్థాన్' కు బదులు 'భూటాన్' యైనది. భూత స్థానమునకు శివుడు రాజు. భూతాన్ రాజు యొక్క ఉపాధి శివుడు లేక భూతనాథుడు. ఆ పీఠము నధిష్ఠించు వారెల్లరు శివుడని పిలువబడుచుండిరి. ఇక పౌరాణికులు మానస సరోవరము చుట్టుప్రక్కల భూభాగపు రాజను 'విష్ణు'వని యనుచుండిరి. మానస సరోవరమే విష్ణువు యొక్క క్షీరసాగరము. మానస సరోవరము (మానుష+ఉర్వర్) మానస సరోవరముగా మారినది. అనగా, నచ్చట ప్రప్రథమముగ మానవసృష్టి జరిగియుండెను. ఆ స్థానమే మానుష = మనుష్యుల, ఉర్వర = పుట్టించు స్థానమని విశ్వసించబడినది. అట్టి ఆదిసృష్టికి విష్ణువు పాలకుడు, రక్షకుడు అని యెంచబడుచుండెడిది.

ఇట్లే సాహిత్యమున పర్వతీయ పురుషులు దేవతలుగ, స్త్రీలు దేవీ గణముగ నెంచబడుచుండిరి. పురాణములందు యముడు, వరుణుడు మున్నగు దేవతలు(విశ్వేదేవతలు) హిమాలయవాసులుగ చూపబడినారు. ఆకాశమున దేవీదేవతలకెట్టి కల్పిత స్థానమును లేదు. ఇంతేగాక ఈ దేవీదేవతల కేవిధమగు ప్రత్యేకస్థానముగాని, యోనిగాని యుండదు.

41. ప్ర. హంస : అట్లయిన ఈ దేశమున చిత్రములందు జూపబడుచున్న శంఖ చక్ర గదా పద్మధారియగు విష్ణు వెవరు?

ఉ. 'విష్ణు' శబ్దమున కెన్నియో అర్థములు గలవు. అవి సూర్యుడు, యజ్ఞము, రాష్ట్రము మున్నగునవి. నీవు చూచిన చిత్రములందు రాష్ట్ర పురుషుని కల్పన యున్నది. 'విష్ణువు' రూపము రేఖా చిత్రము (కార్టూన్) ద్వారా స్పష్టపరచబడినది. అదెట్లనగా- రాజు (రాష్ట్ర పురుషుడు) విష్ణువు. అతడు ప్రజలెల్లరను పాలించుచు

రక్షించుచుండును. అతడు నాల్గు ముఖములుగ రాష్ట్రమంతటిని నాల్గు దిశలను స్థిరముగ జూచుచుండును. కావున నాతనికి నాలుగు చేతులుండుసని నమ్మబడినది. ఒక చేతిలో శంఖముంచబడినది. దాని ధ్వనితో నలుదిశలు సదా జాగరూకతతో సర్వసన్నద్ధముగ నుండునని భావము. రాష్ట్ర పురుషుని ధ్వనిపై రాష్ట్రము నడువకున్న నది నశించును. శంఖము సంగఠనకు ఒకే ధ్వనిపై నడుచుటకు, చంపుటకు, చచ్చుటకు సిద్ధముగ నుండుటకు సూచకము. రెండవ హస్తమున చక్రము గలదు. చక్రమునే యంత్రమునకు దగిలించినను దానియందు 'గతి' వేగము ఏర్పడును. ఆలస్య ముండదు. నాయకుని ధ్వనిపై సిద్ధముగ నుండు జాతియందు ఆలస్య మనునది ఉండదు. అట్లు మెలకువగా నుండునదే సఫలరాజ్య మగును. రాష్ట్ర ఆత్మ రక్షణకు, శత్రు దమనమునకు నవీనతర శస్త్ర సంపద ఎంతయో అవసరము. శస్త్రములు లేకున్న రాష్ట్రము సఫలము, సబలముగా నుండజాలదు. కావుననే విష్ణువు మూడవ హస్తమున శస్త్ర చిహ్నమగు గదాదండము నుంచబడినది. సంగఠనము చైతన్యము, శస్త్రసంపద యుండియును ధనము (కోశము) లేకున్న రాష్ట్రశక్తి సంపూర్ణమని యెంచబడదు. రాష్ట్రరక్షణ, ఉన్నతి, యుద్ధము మున్నగు వానికొరకు ధన మత్యవసరము. కావుననే విష్ణువు నాల్గవ హస్తమున 'పద్మము' అనగా కోశము ఉంచబడినది. అమ్మాయీ నీ కిప్పుడు విష్ణువు యొక్క నాల్గు చేతులు, నాల్గు చేతులందు నాలుగు ప్రత్యేక వస్తువులేల యుంచబడినవో చక్కగా దెలిసి యుండును. ఇవన్ని యుండియు ఆయ వ్యయ క్రమము లేకున్న రాజ్యవ్యవస్థ అస్తవ్యస్తముగనే యుండును. ఆయముకన్న వ్యయ మధికముగ నుండరాదు. వ్యయము తగ్గి మిగులుబాటుండ వలెను. మిగులును 'శేష' మని యందుము. శేషము రాజకోశమున నుండిన రాజు యశోవంతుడగును. కావుననే విష్ణురూప రాష్ట్ర పురుషుని ఆధారము 'శేష' మిగులు అని చూపబడినది. శేష దనగా పాము. మనవారు విష్ణువు కాధారముగ పామును చూపినారు.

ఈ విధముగ పౌరాణిక విష్ణువు చిత్రము పూజించుటకు గాదు. అది యొక సఫల రాష్ట్ర పురుషుని కల్పనకు ఉత్తమ రేఖాచిత్రము(కార్టూన్) మాత్రమే.

ఇంతేగాక బ్రహ్మ, విష్ణువు, శివుడు, చంద్రుడు, వాయువు మున్నగు నామములన్నియు పరమేశ్వరునివే నని వేదము తెలుపుచున్నది.

ఓం తదేవా౽గ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదుచన్ద్రమాః ।
తదేవశుక్రం తద్బ్రహ్మ తా౽ అపః స ప్రజాపతిః ॥

-యజుర్వేదము. (32-1)

ఓం సోమం రాజానం వరుణమగ్ని మన్వారభా మహే ।
ఆదిత్య విష్ణు సూర్య బ్రహ్మాణ చ బృహస్పతిమ్ ॥

సామవేదము. (పూర్వా. 1-2)

స బ్రహ్మ స విష్ణు స్సరుద్ర స్స శివస్సో౽క్షర పరమస్స్వరాడ్ ।
స ఇన్ద్ర స్సకాలాగ్ని స్స చంద్రమాః ॥ (కైవల్యోపనిషత్తు)

అనగా ఆదిత్యుడు, వాయువు, చంద్రుడు, శుక్రుడు, ఆపః, ప్రజాపతి, సోమ, రాజ, వరుణ, ఇన్ద్ర, కాలాగ్ని, రుద్ర, శివ, ఓమ్, స్వరాట్, విష్ణు, సూర్య మున్నగు నామము లన్నియును పరమేశ్వరునివే.

పౌరాణికులిట్టి ప్రత్యేక పేర్లతో వేర్వేరు రూపముల, వ్యక్తుల (దేవతల)ను వారి కుటుంబములను కల్పించినారు. వేర్వేరు ఉపాసనా పద్ధతులను గూడ చేసి అనేక సంప్రదాయ పద్ధతుల నీ దేశమునందు వ్యాపింపజేసినారు. దీనివల్ల విశాలమగు 'ఆర్యజాతి' అనేక ఖండములుగ విభక్తమై పోయినది. అందువల్ల దేశమున కెంతయో హాని చేకూరినది.

42. ప్ర. వీణ: అమ్మా : ముప్పదిమూడు కోట్ల దేవతలనగా నెవ్వరు?

ఉ. 'కోటి' యనగా విధము, ప్రకార మని అర్థము. అనగా, ముప్పదిమూడు విధములగు దేవతలు. వైదిక ధర్మమున ముప్పది మూడు దేవతలును ఈ విధముగ సూచించబడినవి.

1. అష్ట వసువులు : పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు.

2. ఏకాదశ రుద్రులు: ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనుంజయము లను దశ వాయువులు మరియు జీవాత్మ. ఇవి శరీరమును వదలునప్పుడు అందర నేడ్పించును. కావుననే ఇవి 'రుద్రు' లని యనబడినవి.

3. ద్వాదశాదిత్యులు : ఇవి సంవత్సరము నందలి పంద్రెండు మాసములు. ఇవి ప్రతి వస్తువు యొక్క ఆయువును క్రమముగ గ్రహించుచుండును. అనగా తగ్గించుచుండును. ముప్పది రెండవది ఇంద్రుడు (విద్యుత్తు) ఏలయన, ఇది ఐశ్వర్య కారణము. ముప్పది మూడవది 'ప్రజాపతి' అనగా యజ్ఞము. ఇది ప్రాణులను పాలించు వాయు జలముల శోధనకాధారమైనది. ఈ 33 దేవతలు వ్యవహార సిద్ధికి మాత్రమే దేవతలు. కాని పూజించుటకును, ఉపాసించుటకును ఎంత మాత్రము కాదు. శతపథ బ్రాహ్మణమున **'యోఽన్యాం దేవతా ముపాసతే న స దేవ యథా పశురేవ స దేవానామ్'**

అనగా 'అన్యదేవత లందు (పదార్థములందు) ఈశ్వరుడను బుద్ధి గలిగి ఉపాసన యొనర్చువాడు విద్వాంసులమధ్య ఏమి తెలియని పశువుతోసమానుడగును." అని వ్రాయబడి యున్నది. నిరుక్తము నందు 'దేవత' అను దాని అర్థ మిట్లున్నది.

**'దేవో దానాద్వా, దీపనాద్వా, ద్యోతనాద్వా, ద్యుస్థానో భవతీతి వా'**

(నిరుక్త. అ. 7 ఖం.5)

దానాద్వా - దాన మొనర్చుట వల్ల దేవ నామ మేర్పడును.

దీపనాద్వా - ప్రకాశ మొనర్చుట, సత్యోపదేశ మొనర్చుట వల్ల విద్వాంసులు దేవతలనబడుదురు.

ద్యోతనాద్వా - మాతా పితరులు, ఆచార్యులు, అతిథులు, పాలించువారు, విద్య నిచ్చువారు, సత్యోపదేశము నొనర్చు వారును దేవతలే యనబడుదురు.

ద్యుస్థానో భవతీతి వా - ద్యుస్థానమున నుండు సూర్యాది ప్రకాశవంతములైన లోకములును దేవతలే యనబడును. పై నుదహరించిన గుణములు గలవారిని దేవతలందురు. ఇవి చేతనములు, జడములని రెండు విధములుగ నున్నవి. చేతన దేవతలతో సత్సంగ మొనర్చి, జడదేవతలతో విజ్ఞాన పూర్వకముగా

వ్యవహరించి వాటినుండి లాభము పొందవలయును.

43. ప్ర. వీణ: నాలుగు వేదములు (ఋగ్యజుస్సామాథర్వణములు) ఈశ్వరీయ జ్ఞాన గ్రంథము లని నమ్మబడుచున్నవి. ఈశ్వరుడునిరాకారుడు గదా! అతడు వేదజ్ఞానము నెట్లు, ఎప్పుడు కలుగజేసినాడు? జ్ఞానము నిచ్చుటకు ముఖాదీంద్రియములు అవశ్యకములు. నిరాకారుడగుటవల్ల ఈశ్వరున కవి యుండవు. వేదములు మానవకృతములనియే అనేకులు విశ్వసింతురు.

ఉ. బిద్దా : ఈ సృష్టి నిర్మింపబడి దాదాపు 1,97,29,49,112 (2012 నాటికి) సంవత్సరములు గడిచినవి. సృష్ట్యారంభ కాలమున పరమాత్మ మనుష్యునకు ప్రథమముగ జన్మనిచ్చినప్పుడాతడు వ్యవహరించుటకు అవసరమగు సమస్త జ్ఞానము నిచ్చినాడు. అట్టి జ్ఞానమే వేదములు. ఒకవేళ పరమాత్మ మానవునకు వాణి మరియు జ్ఞానము నీయకున్న అత డెప్పుడును జ్ఞానవంతుడు గాకుండెడివాడు. జ్ఞానము నైమిత్తికము ఒక రీయకున్న స్వయముగ వచ్చునది గాదు. నేడు కూడ పర్వతీయ ఆటవిక జాతులవారు వందలాది సంవత్సరముల నుండి ఘోరాటవులందు నివసించుచున్నారు. వారిప్పటికిని మూర్ఖులు, అజ్ఞానులుగానే యున్నారు. ప్రారంభిక జ్ఞానము లభించిన పిదప మానవుడు తన జ్ఞానమును వికాస మొనర్చుకొనగలడు. పూర్వపు విద్య లేనిదే విశేష విద్వత్తును సంపాదించుకొనజాలడు. ఇది మనము నిత్యమును గాంచుచున్న విషయమే.

తనకు వేరై దూరముగ నుండు వారికి జ్ఞానోపదేశ మొనర్చుటకు ముఖము మున్నగు ఇంద్రియ సాధనము లవసరమై యుండును. కాని పరమాత్మ సర్వవ్యాపకుడై తన వ్యాపకత్వముతో వారికి జ్ఞానము నీయగలడు. యోగి పురుషులు నోటితో మాట్లాడకనే మనస్సునందు విషయముల నాలోచించి ఆ యాలోచనలను ఇతరుల మనస్సులందు వేయగలరు. ఇవి మనము ప్రత్యక్షముగ గాంచుచున్న విషయములే. ❖

---

❖యోగసిద్ధుల (మహిమ)ను గూర్చి విద్వాంసులలో కూడా భిన్న భిన్న

అభిప్రాయములు గలవు. మేము చూచినంతవరకు స్వామి సత్యపతి గారి రచన "యోగ మీమాంస" అను గ్రంథము వీటిని గురించి హేతుబద్ధమైన, విజ్ఞాన సమ్మతమైన వివరణ యిచ్చినది. ఆ గ్రంథము ఆర్షగురుకులము, వద్లూరు, కామారెడ్డి, పి.నెం. 503 111 నందు లభించును. జిజ్ఞాసువులు తప్పక చదువవలసిన గ్రంథము-(సంపాదకుడు)

---

వేదజ్ఞానము నిచ్చుట పరమేశ్వరున కేమాత్రము గొప్ప విషయము గాదు. సృష్టియందు మానవుడు జన్మించి వ్యవహారము లారంభించినప్పటి నుండియే అతనిపై ధర్మాధర్మముల బంధనము విధించబడినది. పరమేశ్వరుని నియమములు, అవసరమైన సమస్త జ్ఞానము మానవునకు ప్రారంభముననే ఈయవలసి యుండును. ఏలయన, అతడు తన కర్తవ్యములను తెలిసికొని ఆచరించుచు అకర్తవ్య విషయముల జోలికి పోకుండా నుండుటకు జ్ఞాన మవసరము. కావుననే అట్టి వ్యవస్థ నొనర్చినాడు. వేదములు మనుష్య కృతములు గావు. అవి ఈశ్వరీయ జ్ఞాన గ్రంథములు. మనుష్య కృతములని నమ్మువారు వేదవిద్య యొక్క రహస్యము నెరుగలేరు. ఈ విషయమున మహర్షి దయనందస్వామి విరచిత 'ఋగ్వేదాది భాష్య భూమిక'ను జదివినచో వేద విషయక సమస్త శంకలు నివారణ యగును. ❖

❖ వేదమే 'ఈశ్వరీయ జ్ఞానము' అను మహత్వపూర్వమగు గ్రంథమును ఆచార్య శ్రీరాంఆర్య గారు హిందీ భాషయందు వ్రాసి వైదిక సాహిత్య ప్రకాశన్ కాస్‌గంజ్ (ఏటా) ఉత్తరప్రదేశ్ నుండి ప్రకాశిత మొనర్చినారు. అదియును తప్పక చదువతగినది. – సంపాదకుడు

---

44. ప్ర. హంస: మాతాపితరులు లేకుండా ఆది కాలపు మానవులెట్లు సృష్టించబడిరి?

ఉ. వర్షాకాలమున అచ్చటచ్చట అనేక జీవులుత్పన్నమగుటను నీవు చూచియుందువు. ఆ జీవులు ప్రతి స్థలమునందు పుట్టవు. ప్రత్యేక స్థలములందే

పుట్టుచుండును. ఇదే విధముగ సృష్టి ప్రారంభము మొట్టమొదట వనస్పతులుత్పన్నమగును. ఈ క్రమము మూడు చతుర్యుగముల పర్యంతము జరుగుచుండును. ఒక చతుర్యుగము 43,20,000 సంవత్సరములదై యుండును. ఆ పిదప పృథివిపై ఒక భాగమగు త్రివిష్టపము (టిబెట్టు) అనుచోట పరమేశ్వరునిచే మానవసృష్టి జరుపబడినది. దాని క్రమ మీ విధముగ నుండును. రజ వీర్య పరమాణువుల నిర్మాణ మొనర్చి పృథివి క్రింది కోమల భాగమున మానవుని ప్రారంభిక గర్భ స్థాపితము చేయబడును. పృథివీ రసములతో నాతని పోషణ జరుగుచుండును. గర్భము పూర్ణవికాసము నొందినప్పు డా జీవి పృథివీతలముపైకి వచ్చి స్వచ్ఛందముగ సంచరించుటకు యోగ్యుడగును. అనగా యువశక్తి సంపన్నమైన పిమ్మటనే అతడు పృథివీతలము నుండి పైకి వచ్చును. దీనినే ఆది మానవులు యువావస్థలో ఉత్పన్నమగుదురని యందురు. ఇట్లుగాక, బాలు రగుచో వారిని పోషించి పెద్దచేయుట యెట్లు? వృద్ధులగుచో రాబోవు సృష్టి క్రమమెట్లు జరుగును? కావున వారు యువావస్థయందే జన్మించినారు. ఈ కారణముననే భూమిని 'మాత' అని యందురు. ఏలయన, భూమి తల్లి వలనే మన ప్రప్రథమ పూర్వజులను గర్భధారణ మొనర్చి తన రసములచే తల్లి వలనే పోషించి కనినది. ఇక నా పిదప వర్తమానమున జరుగుచున్నట్లే మైథున క్రమమున సృష్టి జరుగుచున్నది. ప్రారంభిక సృష్టి అమైథునీక్రమమున జరిగినది. కావుననే దీనిని 'అమైథున సృష్టి' అని యనినారు.

46. ప్ర. హంస: ప్రారంభిక సృష్టి యందు ఎన్ని జతలుత్పన్నమైనవి?

ఉ. సహస్ర సంఖ్యలో స్త్రీ పురుష లుత్పన్నమైనారు.

47. ప్ర. హంస: వీరెల్లరు టిబెట్టులో ఏ భాగమునందుత్పన్నమైనారు?

ఉ. మొట్టమొదటనే తెలిపినట్టు వారు టిబెట్టు నందలి మానస సరోవరము చుట్టుప్రక్క ప్రదేశములం దుత్పన్నమైనారు.

48. ప్ర. వీణ: మొట్టమొదటి మనుష్యాది ప్రాణులు హిమాలయ పర్వత ప్రాంతములందే ఏల యుత్పన్నము చేయబడినారు? ప్రపంచము నందలి అన్య ప్రదేశములందేల సృష్టింపబడలేదు?

ఉ. హిమాలయ పర్వతములు ప్రపంచమందలి అన్ని పర్వతముల కన్న అత్యున్నతమైనవి. వాని యన్నిటికన్న ఎత్తయిన శిఖరము సముద్రోపరితలము కన్న 26,000 అడుగుల ఎత్తు గలదు. మొదటి సృష్టియొక్క అధికాంశ భాగము జలమునందే మునిగియుండెనని యందురు. హిమాలయ పర్వతముల పైనను జలజీవుల యొక్క అస్థిపంజరములు లభించినందువల్ల ఒకప్పుడు దాని యధిక భాగము జలమయమై యుండెనను మాట వల్ల ధృవపడుచున్నది. ఈ స్థితి ప్రారంభసృష్టి యందుండెను. తరువాత దాని కొంత భాగమున జలము దొలగి పోయి ఎండుభూమిగ మారినది. కావుననే ప్రాణి సృష్టియును ప్రప్రథమమున హిమాలయములందట్టి భాగములందే జరిగినది. 'డేవిస్' అను అమెరికా దేశ ప్రసిద్ధ విద్వాంసుడు తన 'హర్మోనియా' అను గ్రంథము ఏడవ భాగము 327 వ పుటయందు 'హిమాలయము పృథివిపై అన్నిటికన్న ఉన్నత స్థానమనియు, ఆది సృష్టి హిమాలయముల పైననే జరిగినదని' ఒప్పుకొనినాడు.

'శీతోష్ణము' లను రెండు కాలము లెచ్చట నుండునో అచ్చటనే ప్రారంభిక సృష్టియందు మానవుల పుట్టుక సంభవ మగును. హిమాలయముపై ఈ రెండు కాలములుండును. ఫల పుష్ప తృణ తరు లతా గుల్మాదులు గూడా సమృద్ధిగా నుండినందున మానవులు, పశుపక్ష్యాదులు తమ కడుపులను సులువుగ నింపుకొనగలుగుచుండెను. మానవుని సహజాహారము 'ఫలములు, దుగ్ధములే' యను విషయము ధృవపరచబడినదే. హిమాలయములపై మొట్టమొదట శాకములు ఆకుకూరలు, ఫలములు, తృణములు సమృద్ధముగ నుండుటవల్ల పాలిచ్చు పశువుల నదివరకే విధాత సృష్టించియుండెను. ఆ పిదపనే వానిపై ఆధారపడి జీవించు మానవుల నుత్పన్నము చేసినాడు. ప్రారంభిక మానవులకు ఇన్ని సౌకర్యములున్న ప్రదేశము కేవలము హిమాలయ పర్వతములు గాక ప్రపంచమందలి మరే ప్రదేశము గాజాలదు.

ప్రారంభిక మూలపురుషుల రూప వర్ణములు గల వ్యక్తులు నేడు కూడ కాశ్మీరము మున్నగు ప్రదేశములందు గానవత్తురు. మూలపురుషుల వర్ణ రూపములు అన్ని వర్ణముల మిశ్రమ వర్ణము(రంగు) గలిగి యుండవలయును.

కాశ్మీర బ్రాహ్మణుల వర్ణరూపము లిప్పటికిని అదే విధముగ నుండుట గాంచనగును. ప్రసిద్ధ భాషాశాస్త్రి శ్రీ టేలర్ మహాశయుడు పరిశోధనానంతర మీ విధముగ వ్రాసినాడు. 'మనుష్య జాతి జన్మభూమి స్వర్గతుల్యమగు కాశ్మీరమే' (టేలర్‌గారి 'ఆర్యుల ఆదిస్థానము' అను పుస్తకము 7వ పుటను చూడుడు). మహాభారతము నందొక స్థానమున

**హిమాలయామిదానోఽయం ఖ్యాతో లోక పావనః ।**
**అర్ధయోజన విస్తీర్ణః పంచయోజన మాయతః ॥**

**పరిమండలయోర్మధ్యే మేరు రుత్తమ పర్వతః ।**
**తతః సర్వాః సముత్పన్నాః వృత్తయో ద్విజసత్తమః ॥**

**ఐరావతీ వితస్తా చ విశాలా దేవికాకుహా ।**
**ప్రసూతిర్యత్ర విప్రాణాం శ్రూయతే భరతర్షభ ॥ - (మహాభారతము)**

ప్రపంచమున ప్రసిద్ధమైనది పవిత్ర హిమాలయ పర్వతము. దీని యందొక యోజనము వెడల్పు, ఐదు యోజనముల చుట్టు కొలతలు గలది మేరు పర్వతము. అచ్చటనే ఆది మానవుల ఉత్పత్తి జరిగినది. అచ్చట నుండియే ఐరావతి, వితస్తా, విశాల, దేవిక మరియు కుహ మున్నగు నదులు ప్రారంభమగును. అచ్చటనే బ్రాహ్మణులుత్పన్నమైనారు. ఇంకా ముందునకిట్లు వ్రాయబడియున్నది. **"దేవికా పశ్చిమే పార్శ్వే మానస సిద్ధ సేవితమ్"** దేవికకు పడమర దిశన సమీపముననే మానస (మానస సరోవర) మను స్థలము చుట్టుప్రక్కల సిద్ధ పురుషులుందురు. దీనివల్ల ప్రప్రథమమున మానవసృష్టి హిమాలయములపై టిబెట్టు ప్రాంతము నందలి మానస సరోవరపు చుట్టుప్రక్కల ప్రాంతమేయై యుండెనని స్పష్టమగుచున్నది. ఆర్యసమాజ సంస్థాపకులగు మహర్షి దయానంద సరస్వతి గారును ప్రారంభిక మానవుల అమైథున సృష్టి త్రివిష్టపముననందే జరిగిన ట్లంగీకరించినారు.

48. ప్ర. హంస: ప్రారంభ కాలమున వేదజ్ఞానము మానవులందరకు

లభించియుండెనా?

ఉ. లేదు. ఆ సమయమునం దుత్పన్నమైన సమస్త మానవులకు భాష మరియు వాణీ మాత్రము లభించియుండెను. కేవలము అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులను నలుగురు ఋషులకు క్రమముగ ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వ వేదజ్ఞానము లభించియుండెను. వారట్టి జ్ఞానమును ఆది మానవులలో ప్రచారమొనర్చినారు.

49. ప్ర. హంస: 'బ్రహ్మ' యనగా నెవ్వరు? వేదముల నిర్మాణము బ్రహ్మ యొనర్చినాడని కొందరనుచుందు రది వాస్తవమేనా?

ఉ. నాలుగు వేదముల జ్ఞానమును ఆ నలుగురు ఋషుల ద్వారా ప్రప్రథమముగా పొందిన యా మహావ్యక్తికి 'బ్రహ్మ' యను విశేషణముండి యుండును. నేడు కూడా చతుర్వేదజ్ఞాతకు బ్రహ్మస్థాన మీయబడుచున్నది.

50. ప్ర. వీణ: ప్రారంభమున మానవులు పశువుల వలె అజ్ఞానులై యుండిరి. క్రమక్రమముగా వారికి ప్రపంచము నందలి సంఘటనల జూచుట వల్ల కొద్దికొద్దిగా జ్ఞానము వచ్చి క్రమముగా వికాసము నొందుచు వేదముల రచించునంతటి యోగ్యత వచ్చినదని కొందరనునది నిజమేనా?

ఉ. అది సత్యము గాదు. మానవుని జ్ఞానము నైమిత్తికము. అన్య ప్రాణులందుండు జ్ఞానము ఈశ్వరదత్తము మరియు స్వాభావికము. అభ్యసించనిదే మానవుడు స్వతః ఏ విద్యయును నేర్వలేదని పరీక్షించి చూడబడినది. ఏకాంతమందుంచబడిన బాలకునియందు భాష మరియు జ్ఞానవికాసము జరుగుటను జూడము. ఆదిమ మానవునకు పరమాత్మ వాణి మరియు భాషాజ్ఞానము నీయకుండినచో మానవు డెప్పుడును జ్ఞానవంతుడు గాజాలకుండెడివాడు. ఈ పృథివిపై మానవుని జన్మింపజేసిన ఈశ్వరుని ఉద్దేశ్యము గూడ పూర్ణము గాకుండెడిది.

వేదముల రచన జ్ఞాన విజ్ఞాన దృష్టిలో ఎంతో గంభీరము. మానవ విజ్ఞానసీమ కతీతమై యున్నది. అందు సృష్టి, స్థితి ప్రళయముల వర్ణన ఎంతయో యున్నది. అత్యున్నత విజ్ఞానవేత్తయును దానికి దాసోహమనక తప్పదు. మానవుని ఉన్నతి

కొరకు కావలసిన శిక్షణము. బ్రహ్మ విద్యోపదేశము, జీవాత్మ స్వరూప కథనము, రాజ్య వ్యవహారము, సమాజ నియమముల ఔన్నత్యము, శ్రేష్ఠత వేదములందు చరమసీమను జేరినట్లు గాంచనగును. ప్రాణిమాత్రుల కల్యాణము భౌతిక విద్యల విజ్ఞానము సంపూర్ణముగ వేదములందు నిహితమై యున్నది. వేదములం దేలాటి పక్షపాతము, ఈర్ష్యా ద్వేషముల ఉపదేశమును లేదు. అవి మానవులకే గాక సమస్త ప్రాణుల కల్యాణ సాధనమునకు మార్గప్రదర్శన మొనర్చుచున్నవి. సమస్త సత్యవిద్యల మూలము వేదములందు గలదు. మానవుల యొక్క ప్రపంచముయొక్క సర్వతోముఖోన్నతి కొరకు అవసరమగు జ్ఞానము, మోక్షప్రాప్తి కొరకు కావలసిన శ్రేష్ఠతమ సాధన సంపద లెల్లయును వేదములందు నిహితమై యున్నవి. పరమేశ్వరు డీ జ్ఞానము నంతటిని ఆదిమానవునకు ప్రసాదించి సృష్ట్యారంభము నుండి సృష్ట్యంతము (ప్రళయము) వరకు అది స్థిరముగ నుండు క్రమము నేర్పరచినాడు. వేదము లుత్పన్నమై నేటికి దాదాపు రెండర్బుదముల సంవత్సరముల కాలము దాటినను వాని యందొక్క మాత్రగాని, పదముగాని న్యూనాధికము గాక ఉన్నవి యున్నట్లే ప్రచలిత మగుచున్నవి. వేదములు పరమేశ్వర జ్ఞానము. కావున పరమేశ్వరుని వలెనే సదా తమ స్వరూపమునందు విద్యమానమై యున్నవి. పరమాత్మ నిర్దేశకుడైనట్లే అతని జ్ఞాన భండారమగు వేదములును సర్వథా పవిత్రము మరియు నిర్దేశించునవియై యుండి సదా స్థిరముగ నిత్యమై యుండును.

51. ప్ర. హంస: పరమాత్మ వేద జ్ఞానమును నలుగురు వ్యక్తులకే యిచ్చి యెల్లర కీయకుండుట పక్షపాతము గాదా?

ఉ. 36,000 సార్లు సృష్ట్యుత్పత్తి, ప్రళయములకు పట్టునంత కాలము ముక్తి నొందిన జీవులు మోక్షానందము ననుభవింతురు. అంతటి దీర్ఘకాలమును 'పరాంత కాల' మన యందురు. అవధి సమాప్తమైన పిమ్మట వారు మళ్ళీ సృష్ట్యారంభమున అమైథున సృష్టి యందు జన్మించెదరు. వర్తమాన సృష్టినుండి 36,000 సార్లు పూర్వోత్పన్న సృష్టియందు ముక్తి నొందిన జీవులెందరిలో వారి కర్మల ననుసరించి సర్వశ్రేష్ఠ తపోధనులైన వారియందును, సర్వశ్రేష్ఠులగు

నలుగురు ఋషుల ఆత్మలందు పరమాత్మ నాల్గు వేదముల ప్రకాశమును వేర్వేరుగ గలిగించినాడు. ఇందు పక్షపాత మను మాటయే లేదు. ఇది వైదిక సిద్ధాంతము.

52. ప్ర. వీణ: ముక్తి నుండి మరల తిరిగి వచ్చుట జరుగునా? జీవుడు ముక్తి నొందిన పిదప సదా బ్రహ్మలోకమునందే యుండు ననుట సత్యమేనా?

ఉ. ముక్తి యనునది జీవితమున సాంత (పరిమిత) సమయమున చేసిన సాంత (పరిమితి) కర్మలఫలము. సాంతమనగా స+అంతము=అనగా, అంతమగునదని యర్థము. సాంత కర్మల ఫలము అనంతము గాజాలదు. అది సాంతమేయై యుండును. కావున అవధి సమాప్తమైన పిమ్మట జీవులు మళ్ళీ కర్మ క్షేత్రమున ప్రవేశించుటకై జన్మధారణ మొనర్చవలసియే యుండును. తన యవధి మధ్య కాలమునందు అవి (జీవులు) తిరిగి రాజాలవు. బ్రహ్మ సర్వత్రా వ్యాపించియున్నాడు. కావున బ్రహ్మను పొందుట, అతని సామ్రాజ్యమునందు ఆనందోప భోగముల ననుభవించుచుండుటయే బ్రహ్మలోకప్రాప్తియనబడును. బ్రహ్మలోక మనగా ఒక స్థాన విశేషము గాదు.

53. ప్ర. వీణ: శాస్త్రములందు గల **'న చ పునరావర్తతే న చ పునరావర్తతే'** అను వాక్యముల అర్థమేమి? వీని యందు పునః తిరిగి రారను సంకేతము గలదు గదా!

ఉ. కేవలము అవధి పూర్తియగుటకు పూర్వము తిరిగి రారనియే దీని భావము.

54. ప్ర. హంస: ఆనందము, సుఖము, దుఃఖము అను వాని బేధమును నిర్వచించగలరా?

ఉ. దుఃఖముల అభావమే సుఖము. ఆనందము(దుఃఖము ఏమాత్రము కలిసియుండని కేవల సుఖము, పూర్ణసుఖము నిరతిశయ సుఖము) అనునది పరమేశ్వరుని గుణము. అది కేవలము పరమాత్మ సాన్నిధ్యము వల్లనే ప్రాప్తించును. అది ఇంద్రియజన్య సుఖము గాదు. ఆత్మానుభూతి విషయము. సుఖ మనునది భౌతిక పదార్థముల ద్వారా ఇంద్రియములచే అనుభవించబడునది.

55. ప్ర. హంస: నాలుగు వేదము లందు గల మంత్రముల సంఖ్య ఎంత? అవి ఏ ఋషుల ద్వారా ప్రకటించబడినవి?

ఉ. నాలుగు వేదములలో మొత్తము ఇరువది వేల నాల్గువందల పదహారు మంత్రములు గలవు.

1.ఋగ్వేదమున 10,589 మంత్రములు. అగ్ని మహర్షి ద్వార

2. యజుర్వేదమున 1,975 మంత్రములు వాయుమహర్షి ద్వార

3. సామవేదమున 1,875 మంత్రములు ఆదిత్య మహర్షి ద్వార

4. అథర్వణ వేదమున 5,977 మంత్రములు అంగిరస మహర్షి ద్వార మొత్తము 20,416.

56. ప్ర. హంస: బ్రాహ్మణ గ్రంథము లన నేమి?

ఉ. ఋషులు వేదములపై వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథములను బ్రాహ్మణములందురు.

57. ప్ర. హంస: ఉపనిషత్తులననేమి? అవి యెన్ని ? అవి యన్నియును ప్రామాణికము లేనా?

ఉ. ఋషులు కఠోర తపస్సు నొనర్చి తద్వారా ఆత్మ పరమాత్మల విషయములను అనుభవ పూర్వకముగా తెలిసికొని ఆ జ్ఞానమును ఉపనిషత్తుల ద్వారా మనకు తెలిపినారు. ఉపనిషత్తు లనేకములు. కాని అందు ప్రామాణికమైనవి పదకొండు మాత్రమే. అవి 'ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఛాందోగ్య, బృహదారణ్యక, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర" మనునవి. మిగతా కొన్నింటియందు కొన్ని ఉత్తమ విషయములు గలవు. కాని అనేకములు సాంప్రదాయవాదుల ద్వారా పౌరాణి కాధారమున నిర్మించబడినవి. ప్రక్షిప్తములు చేయబడినవి. కావున నవి వైదికములు గానందున అంగీకరింప దగినవి కావు.

58. ప్ర. వీణ: దర్శనము లెన్ని? వాని నామము లేమి? వాని నెవరు రచించినారు?

ఉ. దర్శనములు ఆరు. వాని నీ దిగువ మహర్షులు రచించినారు.

1. యోగ దర్శనము పతంజలి మహర్షి

| | |
|---|---|
| 2. న్యాయ దర్శనము | గౌతమ మహర్షి |
| 3. సాంఖ్య దర్శనము | కపిల మహర్షి |
| 4. మీమాంసా దర్శనము | జైమిని మహర్షి |
| 5. వైశేషిక దర్శనము | కణాద మహర్షి |
| 6. వేదాంత దర్శనము | వ్యాస మహర్షి |

59. ప్ర. వీణ: స్మృతులెన్ని? వాని యందుండు విషయము లేమి?

ఉ. స్మృతు లనేకములు. వానియందు సమాజ సంగఠన, దాని సంచాలనము, నాలుగు వర్ణముల కర్తవ్యాకర్తవ్యముల నిర్దేశము, వాని నియమములు మున్నగునవి గలవు. వీటన్నిటిలోనూ మనుమహర్షి ప్రణీతమగు 'మనుస్మృతి'యే సర్వమాన్యమైనది. అందులోనూ వేద విరోధులు కొందరు కొన్ని ప్రక్షిప్తాంశములను చేర్చినారు. అవి మాత్రము అమాన్యములు.

60. ప్ర.వీణ: శాఖా గ్రంథము లనగా నేమి?

ఉ. మహర్షులు వేదములపై అనేక వ్యాఖ్యాన గ్రంథములను వ్రాసియుండిరి. అవియే వేదముల శాఖ లనబడును. అందులో నిప్పుడు కొన్ని మాత్రమే లభించుచున్నవి. మిగిలినవి నష్టమైనవి. లుప్తమైపోయినవి.

61. ప్ర. హంస: అనేక విద్వాంసులు ఋగ్యజుస్సామములు మూడింటిని మాత్రమే వేదములని నమ్ముదురు. అథర్వణ వేదము తరువాత నిర్మింపబడినదని యందురు. వారు 'వేదత్రయీ' అని మూడింటికే మాన్యత నిత్తురు మీరే మందురు?

ఉ. నాలుగు వేదములందును చతుర్వేదముల నామముల ఉల్లేఖనము గలదు. అథర్వవేదము తరువాత వ్రాయబడినదను మాట సత్యము గాదు. నాల్గు వేదము లందును మూడు విధములగు మంత్రములు గలవు. అనగా–గద్యాత్మక మంత్రములు యజుర్వేదమున, పద్యాత్మక మంత్రములు ఋగ్వేదమున, గాయనాత్మక మంత్రములు సామవేదమున నున్నవి. నాలుగు వేదము లందలి సంపూర్ణ మంత్రములు ఈ మూడు విధములుగ ఋగ్యజుస్సామాత్మకమై

యున్నందున వేదములు 'వేదత్రయీ' యనబడును. కాని వాని యర్థము వేదములు మూడే యని మాత్రము గాదు. సంస్కృత సాహిత్యము నందంతటను నాలుగు వేదముల మాన్యతయే గలదు.

వీణ: హంస: అమ్మా! మీరు నేడు మా యనేక శంకలకు సమాధాన మొనర్చితిరి. కాని మే మింకను అనేక శంకలకు సమాధానములను దెలిసికొనవలసి యున్నది. ఇట్లే ప్రతి దినమును ప్రశ్నోత్తరముల ద్వారా శంకా నివృత్తి చేసికొనుట వల్ల మా కెంతయో మేలు గలుగ గలదు.

అన్నపూర్ణ : సరే అమ్మాయిలూ! సమయము అధికమై పోయినది. ఇంటి యందెన్నియో పనులున్నవి. నేటి కింతయే చాలు. రేపు ఉదయమున మళ్ళీ శంకా సమాధానములు కార్యక్రమము నేర్పాటు జేసికొందము' అని లేచినారు. కూతు ళ్ళిరువురును తల్లికి 'నమస్తే' యని పాదాభివందన మొనర్చినారు.

రెండవ దినము రెండవ అధ్యాయము సమాప్తము.

# తృతీయాధ్యాయము

నేడు సత్సంగము యొక్క మూడవ దినము. ఈ దిగువ విధముగా శంకా సమాధానములు జరిగినవి.

62. ప్ర. వీణాదేవి: అనేక విద్వాంసులు తమ సాహిత్యమున మహిళల నెంతగానో అవమానపరచినారు. తులసీదాసు గారు **'శూద్ర గవార్, డోల్, పశునారీ యే సబ్ తాడన్‌కే అధికారీ'** అని వ్రాసి స్త్రీల నెంతగానో అవమానపరచినారు. మన హైందవ సమాజమున ఆమెకు తగిన సమ్మాన స్థానము లభించకుండ జేసినాడు.

ఉ. అన్నపూర్ణ : బిడ్డా! స్త్రీ పురుష లెవ్వరైనను సరే, తీవ్ర వైరాగ్య మార్గమున లేక యోగాభ్యాస మార్గమున ఆరూఢమగు నప్పుడు ఇంద్రియములను వశ మందుంచుకొని విషయ భోగముల నుండి తప్పుకొనుట అత్యావశ్యక మగును. ఇట్టి దశయందు పురుషునితో పాటు స్త్రీ యుండినచో అతి బాధక మగును. ప్రాణాయామము మొదలగు అభ్యాసములు పూర్ణ బ్రహ్మచర్య దీక్ష యందుండిననే గాని సాధ్యము గావు. ఇక ప్రాణాయామము లేకున్న మనస్సును వశపరచుకొనుట సంభవము గాజాలదు. కావున శంకరాచార్యుల వంటి సన్యాసి, తపస్వియు అట్టి అభ్యాస స్థితిపరులు (సాధకులు) నారీ సంసర్గమునకు దూరముండవలెనని వ్రాసియుందురు. పురుషులే అనేకులు సంన్యాస, యోగాభ్యాస మార్గ పథికులుగ నుందురు. అట్లే ఏ విదుషీమణియైనను అట్టి అభ్యాసము చేయుచుండినచో ఆమెకు పురుషుడు నరక ద్వారమే యగును. ఆమె అతని సంసర్గము నుండి తప్పుకొనవలసియే యుండును. తులసీదాసుగారి యీ చౌపాయీని లోకులు తప్పుగా అర్థము చేసికొనినారు. దాని వాస్తవిక అర్థ మిట్లు గలదు.

శూద్రుడు – చదివించినను అవిద్వాంసుడుగ నుండువాడు శూద్రుడనబడును.

గవార్ (మూర్ఖుడు) – వ్యవహార కుశలుడు గాని పరమ మూర్ఖుడు. అసభ్య పురుషుడు.

ఢోల్ - మృదంగము, డోలు

పశునారీ - ఇందు పశు శబ్దము పశుప్రకృతి గల మూర్ఖులగు అసభ్య స్త్రీలకు విశేషణముగ నున్నది.

'ఇవన్నియు తాడనము (దండన) ద్వారానే సన్మార్గమున నుంచబడు' నని వ్రాసియున్నారు. ఇది సత్యమే గదా! ఇందే మాత్రము ప్రత్యేకముగా స్త్రీల విషయమని లేదు. తులసీదాసుగారు దుష్ట స్త్రీ పురుషుల నెల్లర నొకే శ్రేణి యందుంచినారు. సజ్జనులను, పురుషార్థులగు పురుషులను, బ్రహ్మవాదినులను, శ్రేష్ఠ విదుషీమణులగు స్త్రీలను నెప్పుడును ఎచ్చటను అతడు నిందించలేదు. దుష్టులగు స్త్రీ పురుషు లిరువురను గూర్చియు ఆ చౌపాయీలు వ్రాయబడినవి. పొరపాటున లోకులు శూద్ర శబ్దమును జాతి వాచకముగ పశు మరియు నారిని వేర్వేరుగ నెంచినారు. ఈ శూద్ర, గవార్ అను శబ్దములు గుణ వాచకములు. పశు శబ్దము తత్తుల్యమగు గుణకర్మ స్వభావములు గల స్త్రీల విశేషణము. తెలిసినది గదా! నీ శంక కిది సరియగు సమాధానమే గదా!

63. ప్ర. హంస: వైదిక ధర్మమందు.మహిళల స్థితిపై మీ యభిప్రాయమును తెలుపుడు.

ఉ. వైదిక ధర్మమున స్త్రీ కత్యంత గౌరవ పూర్ణమగు స్థానము గలదు. విధాత సృష్టి రచనను నర, నారీ యను భేదముతో రెండు రూపములుగ జేసి ఇరువురి కార్య క్షేత్రములను వేర్వేరుగ జేసినాడు. శారీరక దృష్టితో పురుషుడు బలవంతుడు గాను, స్త్రీ కోమలాంగిగ నుండును. సృష్టి సంచాలక కార్య క్షేత్రమున వారి బాధ్యతలు వేర్వేరుగ నుండును. కావున వారి శరీర నిర్మాణములందును విభేద ముండును. ఇన్ని విధములుగ వేరై యుండినను జీవితమున స్త్రీ పురుషు లిరువురి సంబంధ సహకారములు అత్యంతావశ్యకములు, అనివార్యములునై యున్నవి.

వేదము లీ యిరువురి కర్తవ్య క్షేత్రముల విషయము సమగ్రముగ ఉపదేశించినవి. సామాజిక క్షేత్రమున బిడ్డలకు శిక్షాదీక్షలు, విద్యా బుద్ధులు, మరియు స్వాత్మోన్నతిని మోక్షప్రాప్తిని గలిగించు యజ్ఞము, సంధ్య,

వేదాధ్యయనము, యోగవిద్య మున్నగు ఒకే రీతి కర్మలం దధికారము వైదిక ధర్మము కల్పించినది. ఇతర ఏ మత మతాంతరములును ఇట్టి అవకాశములను కలిగించి యుండలేదు. మన ధర్మమున స్త్రీకి సదా పుత్రీ, పత్నీ మరియు మాతృ రూపమున పూర్ణాదర స్థానము గలదు. పుత్రులకు వలెనే పుత్రికలకు గూడ గురుకుల శిక్షాది వ్యవస్థ లుండెడివి. ఈ యిరువురును బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సంన్యాసాశ్రమము లందు ప్రవేశించుటకు నిర్దేశింపబడినది. స్త్రీలు వేదవ్యాఖ్యాతలుగా కూడ గణుతి కెక్కినారు. ప్రశాసనము మరియు సామాజిక సేవ లనబడు సమస్త క్షేత్రము లందును స్త్రీలు ముందంజ వేయుటకు వారి యోగ్యతల ననుసరించి అవకాశము కల్పించబడి యుండెను. మహిళలు భూత, వర్తమాన కాలము లందును రాష్ట్రాధ్యక్షులుగ నుండిరి. మహిళ గృహమందు శ్రేష్టమగు మాత, పతికి శ్రేష్టమగు పత్ని, గృహస్వామిని, మంత్రిణి మరియు గృహిణిగ కుటుంబ నిర్వహణలో పూర్ణాధికారము గలిగియుండును. నారీ గౌరవమున మను మహర్షి గారు స్పష్టముగ ఇట్లు వ్రాసినారు.

"యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతా ః ।
యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఽఫలాక్రియాః ।।"

–మనుస్మృతి 3.56

ఎచ్చట, ఏ దేశమున, ఏ కుటుంబమునందు స్త్రీలు పూజింప బడుదురో అచ్చట దేవతలు అనగా విద్వాంసులు నివాస ముందురు. స్త్రీలకు అవమానము జరిగిన చోట శుభకర్మ లన్నియును నష్టమై పోవును. (ఇచ్చట పూజించుట యనగా పుష్పములతో పూజించుటగాక గౌరవించి సత్కరించుట యని భావము). ఈ విధముగ వైదిక ధర్మమున స్త్రీకి ఎంతటి గౌరవప్రదమగు, సమ్మాన పూర్ణమగు స్థానముండెడిదో అది ప్రపంచమందలి ఇతర ఏ ప్రదేశము నందును గానరాదు.

సాధారణముగ పురుషుల కార్యక్షేత్రము గృహము వెలుపలనే యుండును. ద్రవ్యోపార్జన, రాష్ట్రరక్షణము, వ్యాపారాదుల సంచాలనము కుటుంబ పాలన, పోషణ, రక్షణ యొక్క వ్యవస్థలు చేయవలసి యుండును. అట్లే స్త్రీల కార్యక్షేత్రము గృహమునందే కుటుంబ నిర్మాణము, వారి శిక్షాదీక్షలు, అతిథి అభ్యాగతుల

సత్కార్యము మున్నగునవి యుండును. ఇద్దిరువురి కార్యక్షేత్రములు మహత్వపూర్ణమై యుండి ఒకరికన్న నొకరు న్యూనాధికులు గాక సమానులుగా నుందురు.

64. ప్ర. వీణ: యజ్ఞ మొనర్చుట వల్ల లాభమేమి? ఘృతాది పదార్థములను యజ్ఞములందు గాల్చి నష్ట మొనర్చుట కన్న తినుటవల్ల శరీరమునకు పుష్టి, శక్తి కలుగును గదా!

ఉ. విద్యా : పుష్టికారక పదార్థముల దినుట వల్ల లాభము గలుగగలదు. కాని యజ్ఞముచే గలుగు లాభములు భిన్నముగ నుండును. యజ్ఞ సామగ్రియందు సుగంధ, వ్యాధినాశక, పౌష్టిక, మధురము లను నాలుగు విధములగు పదార్థములుండును. సుగంధిత పదార్థములు ఆరోగ్య ప్రదములై వాని ద్వారా వాయు మండలమును సువాసిత మొనర్చి ప్రాణికోటికి, వృక్ష వనస్పతులు మున్నగు వానికి హితకరము లగును. వ్యాధి నాశక పదార్థములు వాయు మండలమున నుండు రోగవ్యాపక జీవాణువులను, తత్త్వములను నశింప జేయును. పోషక పదార్థములతో యజ్ఞకర్తకు, వారి సమీపమున గూర్చుండు వారికే గాక హోమధూమము వ్యాపించునంతవరకు ఉండు మానవులకు సకల ప్రాణులకు పుష్టి, బలము గలుగును. మధుర పదార్థములు పుష్టి ప్రధాన మొనర్చి ఆరోగ్య భంగకర రోగాణువులను విధ్వంస మొనర్చుచుండును. ఈ విధముగ యజ్ఞ సామగ్రి యొక్క ప్రతి వస్తువు ప్రాణులకు, అప్రాణులకు లాభము గలిగించునదై యున్నది. యజ్ఞాగ్ని యందు హోమ మొనర్చిన ఘృతము (నేయి) పరమాణువులుగా మారి సమస్త పదార్థములు అత్యంత సూక్ష్మ రూపమును దాల్చివాయు మండలమున ప్రవేశించును. సూక్ష్మ మగుట వల్ల భేదన మొనర్చు శక్తి అతి తీవ్రమై దూషిత పదార్థముల నష్ట మొనర్చును. దానితోబాటు స్వాస్థ్యకారక పదార్థముల పరమాణువులు ప్రాణులకు ఆరోగ్య ప్రధాన మొనర్చి శారీరక వ్యాధులను బోద్రోలి శరీరమునకు పుష్టి నొసగును. తినుట మరియు అగ్ని యందు వ్రేల్చుటయందు గల భేదమును దెలిసి కొనుట కొక ఉదాహరణమును జూడుడు. ఒక మిరపకాయను దినినచో దాని ప్రభావము తినిన వారిపైనే కొంచెము పడును. కాని దాని నగ్నిలో వేసినచో ఆ

చుట్టుప్రక్కల దూర ప్రాంతములందుండు వారెల్లరకును దాని తీవ్ర ప్రభావము అసహనీయముగ నుండును. ఈ విధముగా యజ్ఞాగ్నిలో వేయబడిన కొద్దిపాటి పదార్థము అసంఖ్యాక ప్రాణులకు సుఖ సౌభాగ్యములను గలిగించగలవు.

వ్యాధులను దూర మొనర్చుటకు గూడ యజ్ఞముల ప్రయోగము జరుపబడును. వ్యాధుల నివారణ కవసరమగు కాష్టములు (సమిధలు) పత్ర పుష్పములను వైద్యులు ప్రయోగింతురు. యజ్ఞాగ్ని ద్వారా వాని సేవన మొనర్చినచో ఆ యోషధుల సూక్ష్మ పరమాణువులు శ్వాసక్రియ ద్వారా నేరుగా శరీరమున ప్రవేశించి రక్తమునందు గలిసి రోగి నారోగ్యవంతునిగ జేసి వేయును.

ఇంకను వర్షకారక, వర్ష నివారక ఓషధుల ద్వార బృహద్యజ్ఞముల నొనర్చి అల్పవృష్టి, అనావృష్టి, అతివృష్టి క్రమముల ననుకూలముగ జేసికొనవచ్చును. యజ్ఞము ద్వారా గృహము, దేశము, ఆకాశముల వాయు మండలమును వ్యాధి నివారకము, సువాసితము, ఆరోగ్య ప్రదముగ నొనర్చవచ్చును. అన్నౌషధులు – శుద్ధము, శక్తివంతము లగును. వృక్షముల సమీపమున లేక వాని క్రింద యజ్ఞమొనర్చుట వల్లను; యజ్ఞ భస్మమును వాని మూలములందు వేయుట వల్లను గొడ్డు వృక్షములు సైతము ఫల పుష్పవంతములై వృద్ధి నొందగలవు. యజ్ఞ సూక్ష్మ వాయు స్పర్శ వల్ల సకల జీవజంతువులకు మేలుగలుగును. అగ్ని యందు వ్రేల్చబడిన నేతి పరమాణువులు శ్వాస ద్వారా శరీరమున ప్రవేశించినందువల్ల మిఠాయి వర్తకులు చాలవరకు ధృఢ శరీరము గలవారై యుందురు. కావున యజ్ఞము పరోపకారము ఒక ధార్మిక సత్కార్యమే.

65. ప్ర. హంస: యజ్ఞములందు వేదమంత్రములనే ఏల పఠించెదరు?

ఉ. వేద మంత్రములందు ఈశ్వరస్తుతి ప్రార్థన లుండును. ఏ లక్ష్యముతో యజ్ఞకర్త యజ్ఞము చేయునో ఆ లక్ష్యసిద్ధి కొరకు వేదమంత్రముల ద్వారా పరమాత్ముని ప్రార్థన చేయబడును. రెండవ విషయమేమన, ఒక మంత్రములో నిచ్చిన యాహుతి (సామగ్రి, నేయి) రెండవ మంత్ర పఠనము ముగియు వ్యవధిలో భస్మమై సూక్ష్మ వాయువుగా మారును. సామగ్రి సరిగా కాలవలయును. పొగ ఏర్పడకూడదు. అనగా తీవ్ర యజ్ఞాగ్ని యందే ఆహుతుల నీయదగును.

మందాగ్నిలో ఆహుతుల నీయరాదను విషయమును యజ్ఞ నిర్వాహకులు మరువరాదు.

66. ప్ర. హంస: యజ్ఞములందు వేద మంత్రోచ్చారణము బలముగా ఉచ్ఛ స్వరమున జేయవచ్చునా?

ఉ. చేయరాదు. యజ్ఞములందు పఠించునవి పరమేశ్వరుని ప్రార్థనా మంత్రములు. కావున వేదమంత్రముల జదువువారు, వినువారు తన్మయులగునట్లు నెమ్మదిగానే యుచ్చరించదగును. ప్రార్థనోపాసనము లెప్పుడును గట్టిగ నరచుచు జరుగకూడదు. తన్మయత్వముతో తల్లీనతో నెమ్మదిగ జరుపవలెను. సార్వజనిక కార్యములందు తప్ప యజ్ఞ మంత్రములను, ప్రార్థనోపాసనా మంత్రములను ధ్వని విస్తారకము (లౌడ్‌స్పీకర్) ల నుపయోగించి వేడుకల ప్రదర్శన మొనర్చరాదు.

67. ప్ర. వీణ: యజ్ఞ వేదికపై వస్త్రముల దొడుగుకొని కూర్చుండ వచ్చునా?

ఉ. పసుపు పచ్చని వర్ణముగల శుభ్రమగు ఉపవస్త్రము (శల్లా)ను పైనుండి కప్పుకోవలెను. అట్లు గాకున్న శుభ్రముగా నుదుకబడిన వదులుగా నుండు తేలిక వస్త్రములను ధరించి వేదికపై కూర్చుండవచ్చును. పవిత్రమగు యజ్ఞవాయువు సులభముగ శరీరమును స్పృశించునట్లుండి సోమరితనము గలుగకుండ నుండునట్టి వస్త్రములను ధరించవచ్చును.

68. ప్ర. వీణ: యజ్ఞమునకు పూర్వము స్నాన మొనర్చుటవసరమా?

ఉ. ఔను. యజ్ఞమనగా పరమేశ్వరోపాసనము. కావున స్నాన మొనర్చి శుద్ధ పవిత్ర స్థానమున యజ్ఞము చేయవలెను. యజ్ఞపాత్రాది సామగ్రి, స్థలము అన్నియును శుద్ధముగ, పవిత్రముగ నుండవలయును.

69. ప్ర. వీణ: అన్ని వేద మంత్రములతో యజ్ఞ మొనర్చ వచ్చునా?

ఉ. అన్న పూర్ణ : లేదు. ఏయే లక్ష్యములను దృష్టి యందుంచు కొని యజ్ఞ మొనర్చబడునో ఆయా లక్ష్యసిద్ధి కొరకు ఈశ్వర ప్రార్థనామంత్రములు ఏయే వేదములందు గలవో ఆయా వేదముల నుండి ముందుగ వానిని సంకలన మొనర్చుకుని సామాన్య యజ్ఞక్రియ పూర్తియైన పిదప ఆయా మంత్రములతో

యజ్ఞ మొనర్చవలయును. వేదములందు వివిధ విద్యల విషయముల వర్ణన గలదు. ఏదో యొక లక్ష్యసిద్ధి కొరకు అన్ని మంత్రములను ప్రయోగించుట విద్యావిహీనుల కార్యమే యగును. యజ్ఞవిద్యా విజ్ఞానము నెరుగని అజ్ఞాను లిట్టి పొరపాటులనే చేయుచుందురు.

70. ప్ర. హంస: ప్రతి వారికి యజ్ఞము చేయు అధికారము గలదా?

ఉ. కేవలము వేద మంత్రములను శుద్ధముగా ఉచ్చరింప సమర్థుడగు విద్వాంసుడే యజ్ఞోపవీతధారణ మొనర్చి యజ్ఞ మొనర్చుటకు అధికారి యగును. కాని అందరు కారు. అశుద్ధ మంత్రోచ్చారణ వల్ల వేద మంత్రార్థములు మారిపోవును. అట్టి ప్రార్థన హానికరమగును. విధిరహితముగ, మంత్రరహితముగ, తప్పులుగ యజ్ఞము చేయించుట వల్లను; యజ్ఞము చేయించు విద్వాంసునికి తగిన దక్షిణ నిచ్చి సత్కరించకపోవుట వల్లను యజ్ఞము చేయించిన యజమానికి అరిష్టమే కలుగును. యజ్ఞకర్త విద్వాంసుని సంతుష్టి పరచకున్న అతడు ఖిన్నుడగును. అది యజమానునకు తప్పక హానిని కలిగించును. యజ్ఞము యొక్క శుద్ధత, పవిత్రత, దాని ప్రత్యంగము, ప్రతిక్రియపై శ్రద్ధ వహించుట ఎంతో అవసరము. యజ్ఞము చేయుట, చేయించుట అందరి యధికార విషయము కాదు. యజ్ఞక్రియను వ్యాపారముగా మార్చుట సరికాదు. యజ్ఞ నిమిత్తమై సేకరించిన ధనమును, పదార్థములను ఇతర కార్యములందుపయోగించి వ్యయపరచువారు యజ్ఞచోరులనబడుదురు. యజ్ఞచౌర్యము పరమేశ్వరుని ప్రాణికోటి కల్యాణ చౌర్యమే యగును. అది మహాపాపము. యజ్ఞ విషయమున విశేషపూర్ణ పరిచయమునకు 'వైదిక యజ్ఞ విజ్ఞాన' మను పేరుగల మహత్వపూర్ణమగు గ్రంథమును చదువుటకు నేను మిమ్ము ప్రోత్సహించుచున్నాను.

71. ప్ర. వీణ: అమ్మా ! యజ్ఞోపవీతము యొక్క వ్యాఖ్యానము నొనర్చుచు అది ఏమి? దానిని ధరించుటచే కలిగెడు ధార్మిక మరియు వైజ్ఞానిక మహత్త్వ మేమియో తెలుపుడు.

ఉ. యజ్ఞోపవీతము (యజ్ఞ+ఉప+వీతము) అనగా యజ్ఞము ఉప=సమీపమునకు, వీతము = చేరుట. యజ్ఞ సమీపమునకు చేరుట మరియు

చేరుట కధికారమును సంపాదించుట యని యర్థము. విద్యల నభ్యసించి యజ్ఞమున కధికారము పొందుటకు యజ్ఞోపవీతమును ధరించుకొనవలయును. యజ్ఞోపవీతము లేనివారు యజ్ఞమున కధికారులుగ అంగీకరించబడరు. ఇది విద్యా సూత్రము. కావున మూర్ఖులకు, విద్వాంసులుగానివారికి దీని నీయకూడదు. యజ్ఞోపవీతము ద్విజుల మహత్వపూర్ణ సంస్కారము, విద్యావంతుడై, ద్విజుల గుణకర్మ స్వభావములు గల ప్రతి వ్యక్తి యజ్ఞోపవీత ధారణ కధికారి యగును. అతడు యజ్ఞము చేయుటకు, చేయించుట ప్రారంభించుటకు పూర్వము ఈ యజ్ఞోపవీత సంస్కారము జరిపించుకొనియుండటవసరము.

యజ్ఞోపవీతమున మూడు మూడు దారములు గల మూడు పోగులుండును. ఈ మూడు పోగులు మనుష్యుని ఎల్లప్పుడు శారీరక, మానసిక, ఆత్మిక దృష్టితో పరిశుద్ధముగ నుంచుటకును; అతని భుజస్కంధమున పితౄణము, ఋషి ఋణము, దేవ ఋణముల భారము గలదని గుర్తు చేయుటకును; మనస్సు, శరీరము, ఆత్మలో కుసంస్కారములు పడవేయునట్టి, అనారోగ్యము గలిగించునట్టి, జీవనోన్నత మార్గమున బాధాకరమగునట్టి, నిందాపాత్రు దగునట్టి అకార్యము లేవియును చేయరాదని జ్ఞాపక మొనర్చుచుండును. యజ్ఞోపవీతము శుద్ధికి చిహ్నము. అపవిత్ర హస్తములతో దానిని స్పృశించగూడదు. మల మూత్రముల విసర్జన కాలమున అది అశుద్ధము గాకుండ నుండుటకై దానిని చెవిపైకి వేసుకొనవలయును. కాళ్ళు, చేతులు స్వచ్ఛముగ గడిగిన యనంతరమే దానిని చెవి పైనుండి దీసివేయవలయును. అది చెవిపై నున్నంతవరకు కాళ్ళు, చేతులు పరిశుద్ధ పరచబడలేదని జ్ఞాపక మొనర్చుచుండును.

చెవిపై కెక్కించుకొనుటకు మరొక వైజ్ఞానిక కారణము గలదు. ద్విజులకు శారీరక పరిశ్రమలు అధికముగా నొనర్చు అవసర ముండదు. కావున వారి అంతరికాంగములు అధిక పుష్టివంతములుగ నుండవు. వారికి కూర్చుండి చేయు బౌద్ధిక శ్రమయే అధికముగ నుండును. అట్టి కొందరికి ప్రేవులు క్రిందికి దిగుట సంభవించును. కావున నట్టి వారు శౌచమునకు కూర్చున్నప్పుడు ఒత్తిడి వల్ల ప్రేవులు క్రిందికి దిగుట కూడా సంభవమగును. అట్టి సమయమున

యజ్ఞోపవీతమును ఎడమ చెవిపై కెక్కించిన అట్లు గానీయకుండును. ఈ కర్ణ నాడులకు, అంత్రములకు దృఢ సంబంధము గలదు. అనేకులకు వరిబీజ (హైడ్రోసిల్) సంబంధ వ్యాధియందు వారిచెవినాడి ఒక దానికి రంధ్రము చేయుట అనేకు లెరుగుదురు. అందువల్ల ఆ వ్యాధి నయమగును. అట్లే యజ్ఞోపవీత ధారణము ధార్మికముగ, వైజ్ఞానికముగ ఉపయోగకరమైనది. శారీరక శ్రమ యొనర్చని, పరిగెడుతూ పని చేయని ద్విజ వర్గము వారికే యజ్ఞోపవీత ధారణము అనివార్యమై యున్నది. కావుననే విద్వాంసులు మరియు ద్విజులు దీనిని ధరింతురు.

72. ప్ర. హంస: యజ్ఞోపవీతములోని తొమ్మిది దారముల రహస్య మేమి?

ఉ. జందెము యొక్క దారము నిడివి 96 అంగుళములే గలదై యుండును. ఈ (96) అంగుళముల పొడవు గల శరీరము ప్రతి మనుష్యుని వాని చేతిలోని కొలత చేతనే యుండును. అట్టి యీ శరీరమును శుద్ధముగ, పవిత్రముగ నుంచుటకు, వానిని దీర్ఘ కాలము వరకు ఆరోగ్యముగ, స్థిరముగ నుంచుటకు, శతాయువు కన్న అధిక కాలము పరాధీనులుగాకుండా జీవించియుండు భావనను గలిగియుండుటకు యజ్ఞోపవీతము ప్రతి క్షణము జ్ఞాపక మొనర్చుచుండునని భావము.

ప్రతి ద్విజ బాలకుడు గురుకులమున లేక ఆచార్య కులమున ప్రవేశించి నియమ పూర్వకముగా–

4 వేదములు (ఋగ్యజుస్సామథర్వములు)

4 ఉప వేదములు (ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద, శిల్పవేదములు)

6 అంగములు (శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, చందస్సు, జ్యోతిష్యము)

6 దర్శనములు (న్యాయ, సాంఖ్య, యోగ, వేదాంత, మీమాంస, వైశేషికములు)

3 సూత్ర గ్రంథములు (గృహ్యసూత్ర, శ్రౌతసూత్ర, ధర్మ సూత్రములు)

9 అరణ్యకములు ((బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, ఇతిహాసము,

పురాణములు, పరిశిష్టములు, ప్రయోగములు, పద్ధతులు, అనుక్రమణికలు, పద పాఠములు)

24 కళలు (గాన, నాట్య, వాద్య, నృత్య, చిత్ర కళాదులు)

ఈ ప్రకారముగ 24 విధములగు విద్యలు మరియు కళల అభ్యాసము, అధ్యయన మొనర్చి పూర్ణ విద్వాంసు డగుటకు యజ్ఞోపవీతధారి ప్రయత్న మొనర్చవలసి యుండును.

73. ప్ర. హంస: యజ్ఞోపవీతమున నుండు మూడు బ్రహ్మముడుల రహస్య మేమి?

ఉ. యజ్ఞోపవీతధారి జ్ఞాన, కర్మ, ఉపాసన యను నీ మూటిని ఒకటి తరువాత నొకటి చొప్పున ప్రాప్తించుకొని అభ్యసించవలయును. ఇదియే 'బ్రహ్మగ్రంథి' యను మూడు ముడుల రహస్యము.

74. ప్ర. వీణ: స్త్రీలు యజ్ఞోపవీతమును ధరించవచ్చునా?

ఉ. ధరించవచ్చును. పురుషుల వలెనే అధికారిణులగు స్త్రీలు, కన్యలు యజ్ఞోపవీతము ధరించుకొని యజ్ఞముల నొనర్చుటకు అధికారిణులు గావలయును. వేదములందు స్త్రీలు యజ్ఞోపవీత ధారణ మొనర్చు విధాన మున్నది.

75. ప్ర. హంస: అనేకులు ఆరు పోగులు, తొమ్మిది పోగులు జంట యజ్ఞోపవీతములను ధరించెదరు. కారణ మేమిటి?

ఉ. కారణ మేమియును లేదు. అట్లు ధరించుట తప్పు. మూడు సూత్రములు గల యజ్ఞోపవీత మొక్కటియే యుండవలయును.

76. ప్ర. హంస: యజ్ఞోపవీత ధారణ విధిని తెలిపెదరా?

ఉ. దీని సమయము మరియు పూర్ణవిధి మహర్షి దయానంద సరస్వతీ కృత 'సంస్కార విధి' యను గ్రంథమున ఉపనయన సంస్కార పరిచ్ఛేదమున వివరముగ నున్నది. అందు చూచుకొనుట మంచిది.

77. ప్ర. వీణ: అమ్మా ! ఆర్యులు తలపై శిఖ నేల యుంచుకొందురు?

ఉ. అమ్మాయీ! ఇది చక్కని ప్రశ్నయే! శరీర మందలి నాడులు సుషుమ్న నాడినుండి సంచాలిత మగుచుండును. ఒకవేళ ఈ సుషుమ్న నాడియందే భాగమైనను, దాని నుండి సంచాలితమగు ఏ నాడి యొక్క ఏ భాగమైనను వ్యాధిగ్రస్థమైనచో దానికి పక్షవాతమైనదని యందుము. ఈ సుషుమ్న నాడి ఆరోగ్యవంతముగా నున్నచో ఏ యంగమునకు పక్షవాతము వచ్చు భయముండదు. ఈ నాడి వెన్నెముక మధ్యనుండు అస్థి సంస్థానము నుండి పిరుదుల క్రింది ప్రదేశమున ప్రారంభమై తలపై 'శిఖా' భాగమున అంతమగును. శిఖ పెద్దగా, ఒత్తుగా నుండుటవల్ల వెంట్రుక లందలి ఆ భాగమున విద్యుత్తు ఉత్పన్నమై దానివల్ల సుషుమ్న నాడి ఉత్తేజితమై యుండును. కావున శరీరము నందేభాగము నందైనను, ఎప్పుడును పక్షవాతము రాజాలదు.

శిఖనుంచు స్థలముననే 'లఘుమస్తిష్క' మనునది గోష్పాదాకారమున అంతయే పెద్దదిగా నుండును. అదియును సుషుమ్న ద్వారానే సంచాలిత మగును. ఆ స్థానమునందే గోష్పాద సమానమైన శిఖనుంచు విధానము గలదు. దాని వల్ల లఘుమస్తిష్కము వికసించును. దక్షిణ భారతము నందలి వైజ్ఞానికులు పరిశోధన (రిసెర్చి) చేసి 'పెద్దగా, ఒత్తుగా, వెడల్పుగా' శిఖాధారణ మొనర్చిన బ్రాహ్మణులు తీవ్ర ధారణాబుద్ధి గలవారై యుందు' రని తేల్చినారు. శిఖ నుంచుకొనుట మన ధార్మిక, సాంస్కృతిక చిహ్నమేగాక వైజ్ఞానికముగ జూచినను ఎంతో ఉపయోగకరమైనది.

78. ప్ర. వీణ: అమ్మా! నా కిప్పుడు బాగుగ అర్థమైనది. అందులకే గాబోలు స్త్రీలపై పక్షవాత ప్రభావము బహుశః ఉండనే ఉండదు. ఏలయన, వారి తలలపై పెద్ద తలకట్టుండును గదా! కొన్ని విశేష రోగ కారణముల వల్ల కొందరు స్త్రీలకు మాత్రము పక్షవాతము స్వల్పముగ వచ్చుట సంభవించును. కాని పురుషులందు అందులో తలపై జుత్తు లేని వా రనేకులకు ఈ పక్షవాత వ్యాధి వచ్చుచుండును.

ఉ. ఔను బిడ్డా! వాస్తవమే. శిరోజము లందు విద్యుత్తుండును. అది సుషుమ్నకు శక్తి నొసగుచుండును. కేశములను రాత్రి చీకటి యందు దువ్వెనతో దువ్వినపుడు

దానినుండి మెరుపు వంటి ప్రకాశము గాన్పించుటను చూచియుందుము. ఇదియే శిరోజముల విద్యుత్తు. ఇది సుషుమ్న నాడికి పోషక శక్తియునై యుండును.

79. ప్ర. హంస: అమ్మా! స్వప్న మనగా నేమి?

ఉ. మనుష్యుడు తాను చూచిన, వినిన, ఆలోచించిన భావముల మరియు ఆయా వస్తువుల సంస్కారములు సూక్ష్మ శరీరముతో బాటు పునర్జన్మము నందును వెంటనుండును. మనుష్యుని తార్కిక మస్తిష్కము జాగ్రదవస్థ యందు కార్య నిరతమై యున్నప్పుడు శాంతముగ నుండినచో స్వప్నావస్థ యందు జీవాత్మ యొక్క లఘు మస్తిష్కము కార్యనిరతమై పోవును. యంత్రము దూర మందున్నను సినిమా దృశ్యములు విద్యుత్ప్రభావముచే తెరపై బడినట్లే శిఖాస్థానము నందలి లఘు మస్తిష్కము ద్వారా సంగ్రహించబడిన ఆలోచనా చిత్రములు కనురెప్పలపై మరియు భృకుటి మధ్యస్థానముపైబడి స్వప్నమున జీవాత్మకు గాన్పించును. దీనినే స్వప్నమని యందుము. ఈ స్వప్నములందు పూర్వ జన్మలకు సంబంధించిన ఎన్నో జన్మల సంస్కారములు గూడ నుండును. ఈ జన్మలోని సంస్కారములు ప్రబలమగు కొలది పురాతన సంస్కారములు క్షీణించుచు నష్టమై పోవుచుండును. యోగి మహాపురుషు లీ సంస్కారములను ప్రత్యక్ష మొనర్చుకొని తమ యనేక పూర్వజన్మల విషయములను దెలిసికొన గలుగుదురు.

80. ప్ర. వీణ: అమ్మా! అనేకులు ప్రత్యేకించి స్త్రీలనేకులు అపస్మారక (పూనకము) వంటి దశయందు భూత భవిష్యద్వర్తమానకాలము లందలి అనేక విషయములను ఉన్న దున్నట్లు చెప్పుచుందురు. అది యెట్లు సాధ్యమగును? అది యెట్లు అభ్యసించబడునో తెలుపుదురా.

ఉ. తార్కిక మస్తిష్కమును శాంతింపజేసి ఉపచేతనాశక్తిని చైతన్య మొనర్చి భూత భవిష్య ద్వర్తమాన కాలములందు అనేక విషయములు తెలిసికొనబడును. అభ్యాసము వల్ల ఈ విధముగా నొనర్చవచ్చును. ఒక్కొక్కప్పుడు ఏదో యొక విశేషావస్థయందు కొందరి ఉపచేతనాశక్తి జాగృతమై వారు ఇట్టి విషయములను

చెప్పుచుందురు. అభ్యాసముచే ఇట్టి యవస్థను పొందవచ్చునని తెలిపితినిగదా! అంజనము మున్నగు వానిద్వారా జరుగు క్రియలు గూడ ఇట్టి శక్తి చేతనే చేయించుకొనబడుచున్నవి. రాత్రి నిద్రించుటకు పూర్వము అర్ధ నిద్రావస్థయందు ఒకానొక సమయమున ఇన్ని గంటలకు మేల్కొలుప వలసినదిగా తన్ను తా నాదేశించుకొని నిద్రించవలెను. లఘుమస్తిష్కముతో సంబంధమున్న ఉపచేతనా శక్తి ఆ మనుష్యుని సరిగా అదే వేళకు మేల్కొలుపును. ఇట్లే వరుసగా కొంతకాలము అభ్యాస మొనర్చినచో ఈ శక్తి పూర్తిగా, నమ్మకముగా పని చేయుచుండును. ❖

---

❖మానసిక శక్తులను గురించి కూడ లోకములో భిన్న భిన్న అభిప్రాయములు గలవు. హిప్నాటిజం ద్వారా మనలోని కొన్ని మానసిక బలహీనతలను దూరము చేసికొనవచ్చును. శారీరక బలమును, ఇంద్రియ శక్తులను కొంతవరకు పెంచుకొన వచ్చును. రిగ్రెషన్ (జీవితములో వెనక్కి పోవుట) ద్వారా మన జీవితములో పూర్వము జరిగిన సంఘటలను కొంతవరకు గుర్తు చేసుకొనవచ్చును. కాని యితరుల భూత భవిష్యద్వర్తమానములను తెలుసుకొనుట అనునది ఆలోచించవలసిన విషయము. -సంపాదకుడు.

---

సరియగు సమయమున మేల్కొను అభ్యాసమైన పిదప తానేదో స్థాన విశేషమున విహార మొనర్చుటకును లేక ఏదో యొక వ్యక్తి దర్శన మొనర్చుకొనుటకును గూర్చి యాదేశమిచ్చి నిదురించుచుండవలెను. ఇట్టి యభ్యాసము పూర్తిగ సిద్ధించిన పిదప ఇతర విషయముల నాదేశించుచు సిద్ధింపజేసికొనవచ్చును. స్వప్నమున ప్రతి విషయమునకు సరియైన సమాధానము లభించుచుండిన పిదప క్రమక్రమముగ జాగ్రదవస్థ యందును నిర్విచారముగ ఏకాగ్రచిత్తుడై ప్రశ్నలకు సమాధానములను గోరుచుండవలెను. ఈ యభ్యాసము సిద్ధించుటకును అధిక కాలము పట్టును. త్వరపడినను, ఏకాగ్రత, సత్సంకల్పము లేకున్నను; ఇతరులకు కీడు చేయు దుస్సంకల్పము గల వారికిని ఇది సాధ్యము కాదు. సంయమము ద్వార దీని నభ్యసించిన వారు సిద్ధ పురుషులై లోకులకు

భూత భవిష్యద్వర్తమాన కాలముల విశేషములను దెలుపుచు చకితుల నొనర్చగలరు. ❖ ఇది యొక విధముగ యోగాభ్యాసము. యమ నియమములను పాలించుచు, తేలికయగు సాత్వికాహారమును భుజించుచు, బ్రహ్మచర్యము, నిశ్చింత, నిశ్చిత మస్తిష్కముతో సాధ్యమైనంత వరకు ఏకాంతమందే దీని నభ్యసించు చుండవలెను. సంసార జంఝాటము లందు జిక్కుకొనిన వారి కిట్టి సాధన అతి దుష్కరమగును. కొందరి కిట్టి శక్తి పూర్వజన్మ సంస్కారముల వల్ల లఘుమస్తిష్కము వికాసము నొంది స్వతః సిద్ధించును. దురదృష్టవంతులు కొందరు ఇట్లు లభించిన శక్తిని గారడీ తమాషాగా ప్రదర్శించి నష్టపరచుకొందురు. మహాపురుషులనేకులకు అనాయాసముగ, అప్రయత్నముగ స్వప్నమునందు గాంచిన దృశ్యములు, విషయములు, భవిష్యములు సత్యముగ పరిణమించును. దీనిని ఉజ్వల స్వప్నము లందురు. ఇవియును లఘుమస్తిష్క ప్రభావము వల్లనే గలుగును. మానవుడు అసంఖ్యాక శక్తుల భండారము. వీటిని దెలిసికొని వికసింప జేసికొని లాభము నొందుట యోగి పురుషుల కార్యము. సర్వసాధారణ మానవుల కిది సుసాధ్యము గాదు. కాని కష్టసాధ్యము.

81. ప్ర. హంస: యోగి ఆకాశమందు విహరింపగలడా?

ఉ. ఔను! యోగి సంకల్పముతో తన శరీరమును భారరహితము (తేలిక)గా నొనర్చుకొని మనోవిద్యుత్తునకు ఆకాశవిద్యుత్తుతో సంబంధము గలిపి మనోశక్తి యోగమున తలచిన చోటికి చేరగలడు. ఆకాశగమన మొనర్చగలడు. దూర దేశస్థ విషయములను తెలిసికొనగలడు. స్వమనోగత విషయముల నితరుల మనస్సులందు ప్రవేశింపజేసి వారిని ప్రభావితుల జేయగలడు. ఈ శక్తి యోగ సిద్ధుల వల్ల ప్రాప్తించును. కొందరకు మాత్రము పూర్వజన్మ సుకృతమువల్ల లభించును. దీనిని పూర్ణయోగియే సిద్ధింప జేసికొనగలడు. ❖

82. ప్ర. హంస: మనస్సు నందును విద్యుత్తుండునా?

ఉ. వేదములందు మనస్సు **'జ్యోతిషాం జ్యోతిః'** అనగా అది విద్యుత్కేంద్రమని ధృవపరచబడినది. వాస్తవమే గదా!

83. ప్ర. హంస: ఆకాశమందు వ్యాప్తమైయున్న సూక్ష్మశబ్దములను యోగి వినగలడా?

❖పూర్వపు పుటలలో సూచించినట్లుగా యోగసిద్ధులను గూర్చిన సరియైన అవగాహన కొరకు ఆర్ష గురుకుల ప్రచురణ - 'యోగ-మీమాంస' చదువగోరెదము.

-సంపాదకుడు.

---

ఉ. 1. కర్ణేంద్రియములందు మనస్సును సంయమ మొనర్చి యోగి ఆకాశమందు వ్యాప్తమై సూక్ష్మ శబ్దములను వినగల శక్తిని పొందగలడు.

2. కంఠ కూపమున సంయమ మొనర్చుట ద్వారా ఆకలి దప్పుల నివృత్తి జేసికొను శక్తిని పొందగలడు.

3. భృకుటి మధ్యన సంయమ మొనర్చి భూత భవిష్యద్వర్తమాన విషయముల జ్ఞానమును పొందగలడు.

4. నాభి చక్రమున సంయమ మొనర్చుట వలన శారీరక విజ్ఞాన విషయములు గ్రాహ్యమగును. ఇట్టివే ఇంకా అనేక విధములగు సిద్ధులు యోగాభ్యాసముచే ప్రాప్తించును.

84. ప్ర. వీణ: ఈ సిద్ధుల వల్ల యోగికి గలుగు లాభమేమి?

ఉ. సిద్ధులన్నియును స్వతః యోగాభ్యాసమును ప్రాప్తించు కొనుటకై యున్నవి. కాని యోగి వీటినే అంతిమ లక్ష్యముగ భావించి తృప్తి పడడు. వీనిని ప్రదర్శనముగ నుపయోగింపడు. అతడు నిరంతరము బ్రహ్మ ధ్యానమున తల్లీనుడై, తన్మయుడై యుండుటకు స్థిరత్వమును సంపాదించుకొనును. అతని యంతిమ లక్ష్యము బ్రహ్మప్రాప్తి లేక మోక్షప్రాప్తియై యుండును. అత దందులోనే తల్లీనుడై యుండి చివరకు సఫలీకృతుడగును.

85. ప్ర. వీణ: వర్షాకాలమున మేఘములందు గర్జనలు, మెరుపుల ప్రకాశ మేమి? మేఘములు పరస్పరము ఢీకొనుట వల్ల గలుగుచుండునని యనుచుందురు. నిజమేనా?

ఉ. కాదు బిడ్డా! మేఘములు ఢీకొనుట వల్ల ధ్వని గలుగుటకు అగ్ని పుట్టుటకు

అవి కఠిన పదార్థములు కావు గదా! కాని ఆకాశమున ఋణగుణము, ధనగుణము (నెగెటివ్, పాజిటివ్) అను రెండు రకముల విద్యుద్ధారలు జలముతో పాటు ఉత్పన్న మగుచుండును. వాని సంసర్గము వల్ల భయంకర గర్జనల ధ్వనులు, మెరుపుల ప్రకాశము ఉత్పన్న మగుచుండును.

86. ప్ర. వీణ: ప్రాచీన ఋషులు, మునులు తలలపై జటల నేల ఉంచుకొనుచుండిరి? ఆ కాలమున కత్తెరలు, కత్తులు లేకుండెడివా?

ఉ. తలపై వెంట్రుకలలో విద్యుత్సంగ్రహము జరుగుచుండును. ఆ విద్యుత్తు వల్లనే మస్తిష్క శక్తి వికసించుచుండును. ప్రాచీన ఋషులు, మునులు దాని సంగ్రహము, ఉపయోగము, ధ్యాన, సమాధ్యవస్థయందు జేయుచుండిరి. కావున వారు తలలపై జటలను బెంచుకొనుట వైజ్ఞానిక దృష్టితో అత్యావశ్యకమని ఎంచుచుండిరి. కేశముల గొరుగు, కత్తిరించు పరికరములు భారతదేశమునం దనాది నుండియే ఉండెను. మిగతా సర్వజనులును వెంట్రుకలను గొరిగించుకొనుట, కత్తిరించుకొనుట జరుపుకొనుచుండిరి గదా!

87. ప్ర. వీణ: సాధువులు, మహాత్ములు గైరిక (జాజు) వర్ణము మరియు ఎఱ్ఱని కాషాయ వస్త్రము లేల ధరించుచుండిరి?

ఉ. ఎఱ్ఱని వర్ణము ఊష్మ (ఉష్ణ) ప్రధాన మొనర్చు గుణముగలది. అది చలిని, వాతవ్యాధులను ఉత్పన్నము చేయనీయదు. ఉత్పన్నమైనను దానిని నశింప జేయును. పక్షవాతము మున్నగు భయంకర వ్యాధులను గూడ నాశన మొనర్చును. స్నాయు నాడులకు పుష్టి నొసగును. కామ వాసనల నణచివేయును. వర్ణము (రంగు)ల వల్ల శరీరముపై జరుగు ప్రభావములను (వర్ణ విజ్ఞానమును) మన మహర్షులు చక్కగ నెరిగియుండిరి. దాని యాధారముననే సాధువులకు వారు కాషాయ (గైరిక) వస్త్రములను ధరించు విధానము నేర్పరచినారు.

మూడవ దినము. మూడవ అధ్యాయము సమాప్తము

ఓమ్ శమ్

# చతుర్థాధ్యాయము

87. ప్ర. వీణ: అమ్మా! శ్రీరామచంద్రుని కాలము గడచి ఎన్ని సంవత్సరములైనది?

ఉ. శ్రీరామచంద్రుడు త్రేత, ద్వాపరయుగ సంధి కాలముననుండెను. మహాభారత శ్లోకమున ఇట్లున్నది:

**"త్రేదా ద్వాపరయోః సంధౌ రామః శస్త్రభృతాం పరః ।**
**అసకృత పార్థివక్షత్రై జఘూనామర్ష చోర్జితః ॥"**

–మహాభారతం ఆది పర్వం. 2-3

శస్త్రధారులలో శ్రేష్ఠుడగు శ్రీరామచంద్రుడు త్రేత ద్వాపరముల సంధి కాలమున నుండెను. అతడు దుష్ట రాజులను సంహరించి ధర్మ స్థాపనము నొనర్చినాడు. అనగా 8,64,000 సంవత్సరములు ద్వాపర యుగమున, 5,112 సంవత్సరములు కలి యుగమున గడిచిపోయినది. అంతకంటె పూర్వము త్రేత ద్వాపర సంధి కాలమున శ్రీరాముడుండెను. అనగా దాదాపు తొమ్మిది లక్షల కాలము గడిచిపోయినది.

89. ప్ర. వీణ: శ్రీకృష్ణచంద్రుని కాలము గడచి ఎన్ని సంవత్సరము లైనది?

ఉ. శ్రీకృష్ణుని కాల మిప్పటికి దాదాపు 5,112 సంవత్సరములకు పూర్వముది.

90. ప్ర. హంస: అమ్మా! రావణుని లంకానగర మెచ్చట నుండెను? ఇప్పటి శ్రీలంకయే రావణుని లంకయై యుండెనా?

ఉ. ఇప్పటి లంక నేటికి దాదాపు తొమ్మిది లక్షల సంవత్సరముల క్రిందట భారతదేశములోని భూభాగమే. సముద్రము దానిని కోసి భారతదేశము నుండి వేరు పరచినది. రావణుని లంకా విషయమున రామాయణమునం దిట్లు వ్రాయబడియున్నది:

"శత యోజన విస్తీర్ణం సాగరో మకరాలయమ్ ।
అలంఘ యిషసానంద సందోహో మారుతాత్మజః ॥"

–ఆధ్యాత్మ రామాయణం. సుం.కా. 1.1

అనగా హనుమంతుడు జల జంతువులతో పూర్ణము, శతయోజన విస్తీర్ణమునగు సముద్రమును దాటి లంకకు జేరియుండెను. ఐతే భారతదేశము మరియు లంకకు మధ్య వంద యోజనములు (నాలుగు వందల క్రోసులు లేక దాదాపు 8,9 వందల మైళ్ళు) విస్తీర్ణ సముద్రముండెను. ఇప్పటి శ్రీలంక భారతదేశము నుండి కేవలము 23 మైళ్ళ దూరముననే యున్నది. ఇది రావణుని లంక గాజాలదు. భూగోళ పటమును జూచుటవల్ల దెలియున దేమన, ఆఫ్రికా ఖండ సమీపమున సముద్రమునందు 'మెడగాస్కర్' అను నొక ద్వీపము గలదు. అది భారతదేశపు దక్షిణ తీరమునకు దాదాపు వేయి మైళ్ళ దూరమున నున్నది. ఆ దేశవాసులు 'నీగ్రో'ల వలె నుందురు. వారినే 'రాక్షసు'లని యనిరి కాబోలు. అదియే రావణుని లంకయై యుండెను.

బుడతకీచులు, ఫ్రాన్స్ మున్నగు దేశీయులు భారతదేశముపై ఆక్రమణ మొనర్చి మనదేశపు తీర ప్రాంతములందు నివాస స్థానముల నేర్పరచుకొని రాజ్యస్థాపన మొనర్చికొనినట్లే రావణుడు తన లంక (మెడగాస్కర్) నుండి వచ్చి మనదేశపు కొంతభాగముపై అధికారము స్థాపించుకొనినాడు. శ్రీరామచంద్ర మహారాజు అతనిని ఓడించి భారతదేశమునందాతని యధికారము నంత మొనర్చినాడు. శ్రీరాముని ఈ యుపకారమునకు ప్రజలు ఆదరణపూర్వకముగా నాతనికి 'భగవాను' డను బిరుదు నిచ్చియుండిరి.

91. ప్ర. హంస: మారీచు డనగా నెవడు? ఎచ్చట నుండువాడు?

ఉ. మారీచుడు రావణునకు మామ యగును. 'మారీచస్' అను దేశానికి రాజుగ నుండెను. మారీచస్ యొక్క అపభ్రంశ రూపమే నేటి మారీశస్ లేక మౌరీశస్.

92. ప్ర. హంస: అమ్మా! శ్రీరాముడు సీతాదేవి శ్రీకృష్ణుడు మున్నగు పూర్వ పురుషులు సంధ్య నొనర్చుచుండిరా?

ఉ. ఔనమ్మాయీ! వారు ప్రతి దినము సంధ్య నొనర్చుచుండిరి. వాల్మీకి రామాయణమునందు రాముడు, సీత విషయములో నిట్లు వ్రాయబడినది.

"ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సహభ్రాత్రా యథావిధి ః ।
ప్రవివేశాశ్రమం పదం తమృషిం చాభ్యవాదయత్ ॥"

-వాల్మీకి రామాయణం అరణ్యపర్వం 11-69

రాముడు తన తమ్ముడగు లక్ష్మణునితో బాటు సాయంకాలమున సంధ్యోపాసన నొనర్చి ఋష్యాశ్రమమున ప్రవేశించి అతనికి అభివాదన మొనర్చినాడు.

"తథైవ గచ్ఛత స్తస్య వ్యాపాయద్ రజనీశివా ।
ఉపాస్యతు శివాం సంధ్యాం విషయానత్రగాహతు ॥"

-వాల్మీకి రామాయణం అయో. 49-2

'నడచుటయందే శ్రీరామునికి శుభప్రదమగు రాత్రి గడచినది. ప్రాతఃకాల సంధ్య నొనర్చుకొని యాతడు ముందుకు నడచి రెండవ దేశమునకు చేరినాడు." దీనివల్ల శ్రీరాముడు ప్రాతః సాయం సంధ్యోపాసన లొనర్చుచుండినట్లు స్పష్టమగుచున్నది.

"సంధ్యాకాలమనాః శ్యామా ధృవమేశ్యతి జానకి ।
నదీచేమాం శుభజలాం సంధ్యార్థో వరవర్ణినీ ॥"

వాల్మీకి రామాయణం సుం. 14-59

"సీతాదేవి సాయంకాల సంధ్య నొనర్చుటకు ఈ శుభజల యుక్తమగు నదీతీరమునకు తప్పక రాగలదని హనుమంతుడు తలచినాడు. దీని వల్ల సీతాదేవి సంధ్య నొనర్చుచుండెడిదని స్పష్టమగుచున్నది.

"క్వాపి సంధ్యా ముపాసీనాం జపన్తం బ్రహ్మవాస్యతామ్ ।
ధ్యాయన్త మేక మాసీనం పురుషం ప్రకృతేః వరమ్ ॥"

-భాగవతం 30-10-69

శ్రీకృష్ణుడెచ్చటనో ఏకాంతమున కూర్చుండి మౌనవ్రతుడై ప్రకృతితో గూడ

పరబ్రహ్మ ధ్యాన మొనర్చుచుండెను. అప్పుడు నారదుడు అతని జూచినాడు.

ఈ ప్రమాణము వల్ల శ్రీకృష్ణచంద్రుడు తన్మయత్వముతో పరమేశ్వరోపాసనము నొనర్చుచుండె ననుట స్పష్టమగుచున్నది.

93. ప్ర. హంస: వృక్షములందు జీవాత్మ యుండునా? వృక్ష వనస్పతుల ననేకులు సజీవులని యందురు గదా!

ఉ. మానవులకు వలె వృక్షములందు జీవాత్మ యుండదు. అవి భూమి యొక్క విద్యుత్తు వల్లనే జీవించి యుండును. పృథివి, సూర్యుడు, వాయువు, జలము, ఆకాశము లను పంచ భూతములే వానికి పోషకతత్వము నిచ్చుచుండును. వనస్పతులు మరియు వృక్షములందు వాని ఆకుల వెనుక భాగము నుండి బయలుదేరు నారలు వాయువు ద్వారా ప్రసరితమగు ప్రాణశక్తిని గ్రహించుచుండును. మూలము, శాఖ, దండముల యొక్క త్వచ (పట్ట) నుండి వాని కాహారము లభ్యమగుచుండును. మానవుడు మొదలగు ప్రాణులు చర్మము లేకుండ జీవించనట్లే పట్ట నొలిచివేసినచో వృక్షములు, వనస్పతులు జీవించి యుండజాలవు. మానవుల శరీర మందుండు అభిమాన జీవాత్మ వృక్షములు మొదలగు వాని యందుండదు. కానీ వానియందు ప్రాణశక్తి యుండి వానిని జీవించి యుంచును.

ఈశ్వర సృష్టియందు సమస్త జీవులు ఒకే విధమగు జీవన నియమమందు నడచుచుండుట దృష్టి గోచరమగుచున్నది. కఫ, వాత, పిత్త దోషముల వల్ల మానవుడు వ్యాధిగ్రస్తుడై చికిత్సల వల్ల ఆరోగ్యవంతు డగునట్లే వృక్షాదులు గూడ కఫ, వాత, పిత్తాదుల ప్రకోపము వల్ల రోగగ్రస్థమైనను చికిత్సల వల్ల స్వస్థత నొందుచుండును. మనుష్య వ్యాధులం దుపయోగబడు ఔషధులే మాత్రా భేదముచే పశు పక్ష్యాదులు, వృక్షజాతులందును వ్యాధి నివారణ కార్యమొనర్చును. అభిమాన జీవాత్మ అస్తిత్వము వానియందు లేకున్నను చికిత్సా దృష్టితో మానవ పశు పక్షి వృక్ష లతాది వనస్పతు లందును కఫ వాత పిత్తము లను త్రివిధ ధాతువులు సామ్యముగనే గాన్పించును.

94. ప్ర. వీణ: అత్తపత్తి (సిగ్గాకు) మొక్క మనుష్యుని చేయి తగులగనే

ముడుచుకొని పోవుచున్నందున ఆ మొక్కలో జ్ఞానము (తెలివి) గల జీవాత్మ యుండునని యనిపించును గదా!

ఉ. సూదంటురాయి (అయస్కాంతము) లోహము నాకర్షించు నట్లు జీవాత్మ లేకున్నను విద్యుత్ప్రభావము వల్ల యంత్రములు స్వయముగా నడుచుచున్నట్లు మానవ శరీర వాసన మరియు విద్యుత్తు స్పర్శ వల్ల సిగ్గాకు మొక్క ముడుచుకొనును. ఇది భౌతిక పదార్థములపై భౌతిక ప్రాణశక్తి మరియు విద్యుత్ప్రభావ కారణమున జరుగును. దిక్సూచి యొక్క సూచి ఎల్లప్పుడును ఉత్తర దిశనే చూపును. దానిలో జీవాత్మ ఉండి దిశను చూపుచుండునని యనగలమా? ఉత్తర ధృవపు ఆకర్షణశక్తి వల్ల సూది ఆ దిశకే మరలుచుండును. ఇవి యన్నియును విజ్ఞాన సంబంధ విషయములు. వానిలో జీవాత్మ ఉండియే ఆ పనులను చేయుచున్నదని యనజాలము.

95. ప్ర. హంస: శ్రీరామచంద్రుడు మాంసాహారియా? అతడు మృగములను వేటాడుచుండెనట కదా!

ఉ. శ్రీరాముడు మాంసాహారి కాడు. అతడు వేదవిదుడు, మహా పురుషుడు. వైదిక ధర్మమున మాంసాహారమును తామస, రాక్షస భోజనముగ నెంచబడినది. వైదిక ధర్మానుయాయి అగు శ్రీరాముడు మాంసాహారి యెట్లగును? మొదట వాల్మీకి రామాయణమున 6,400 శ్లోకములు మాత్రమే యుండెను. లోకులు అందు అనేక ప్రక్షేపములను చేర్చిరి. ఇప్పుడు దానియందు 24,000 శ్లోకములున్నవి. శ్రీరాముని మాంసాహారిగా ప్రకటించు శ్లోకము లన్నియు వామమార్గీయులచే ప్రక్షిప్తము లొనర్చబడినవే. వానిని మనము నమ్మగూడదు.

వాల్మీకి రామాయణమున మారీచమృగ విషయమున వ్రాయబడి యున్నది. సీతాదేవి రామునితో ఈ మృగమును బట్టుకొని తెమ్మనినదేకాని చంపి తెమ్మనలేదు.

"ఆర్యపుత్రాభిరామోసౌ మృగాహరతి మేమనః ।
అనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి ॥"

–వాల్మీకి రామాయణం 10

హే ఆర్యపుత్రా! రామచంద్ర! ఈ మృగమును బట్టి తెమ్ము. ఇది నా మనస్సును హరించినది. నేను దీనితో నాడుకొందును.

"సమాప్త వనవాసానాం రాజ్యస్థానాం చ మే పునః ।
అంతఃపురే విభూషార్థో మృగఏష భవిష్యతి ॥"

–వాల్మీకి రామాయణం. 17

వనవాస కాలము పూర్తియైన పిదప మనము మన రాజ్యమునకు తిరిగి పోయినప్పుడు ఈ మృగము మా రాణీవాసమునకు భూషణముగ నుండగలదు.

దీని తరువాత 'ఒకవేళ ఈ మృగము జీవములతో జిక్కని యెడల చంపి తెమ్ము. ఏల యన, దాని సుందరమగు చర్మము అలంకారమునకు పనికివచ్చు'నని సీతాదేవి రామునితో ననినట్లున్నది.

96. ప్ర. వీణ: మాంసాహారము పాపమని ఏల యనబడినది?

ఉ. జీవహింస చేయనిదే మాంసము లభించదు. జీవులను చంపుట పాపమే గదా! ఇంతేగాక మాంసాహారము తామసికము. దీని సేవన వల్ల మానసిక, ఆత్మిక శక్తులు నశించును. ఇది ఆలస్యముగ జీర్ణమగు పదార్థము. ప్రేవులను చెరచును. ఇది మానవ భోజనముగాదు. మాంసాహారి కొద్దిపాటి పరిశ్రమ చేతనే ఎగరొప్పును. కాని శాఖాహారి మాంసాహారి కన్న అధిక బలిష్ఠుడై యుండి ఎంతటి కఠోర శ్రమనైనను సహించగలడు. ఎంత దూరమైనను పరుగు తీయగలడు. శాఖాహారి యగు ఏనుగు విశాల వృక్షములను ఊపగలదు. మాంసాహారి యిందట్టి శక్తి యుండదు.

పరమేశ్వరుడు మానవుని శాకాహారి శ్రేణి జీవిగ జేసినాడు. మాంసాహార జీవులకన్న నాతని శరీర నిర్మాణము భిన్నముగ నుండును. అవి మాంసమునకై జీవులను చంపి చీల్చుట కనుకూలముగ పళ్ళు మొనదేలి పదునుగా నుండును. మాంసాహారులు నీరు ద్రాగునప్పుడు 'చప చప' మను ధ్వనితో నీటిని నాలుకతో చప్పరించి మ్రింగును. వాని శరీరముల నుండి చెమట వెడలదు. మాంసాహార జీవుల ఆహార నాళిక శాఖాహార జీవుల నాళిక కన్న మిక్కిలి కురచగా నుండును.

చిన్న నాళిక యందు మాంసాహారము త్వరగ జీర్ణమగును. కాని పొడవు నాళికయందది జీర్ణమై బయటపడుటకు అధిక సమయమవసరము. అందువల్ల ప్రేవులందు ఆహారము క్రుళ్ళిపోవును. కావుననే మాంసాహార జీవుల నాళికను ఈశ్వరుడు కురుచగ నుంచినాడు. మాంసాహార, శాఖాహార జీవుల చేతులు, పంజాలు, గోళ్ళు భిన్నముగా నుండును. మానవ శరీర నిర్మాణము శాఖాహార జీవుల కోవకు జెందునో, మాంసాహార జీవుల కోవకు జెందునో ఎవ్వరైనను సులువుగా దెలిసికొనవచ్చును.

మాంసాహార జీవుల పిల్లలు స్వభావసిద్ధముగనే వేటాడును. కాని శాఖాహార జీవుల పిల్లలు, మనుష్యుల పిల్లలు ఫల శాకముల నపేక్షించుచు మాంసము నసహ్యించుకొనును. మురికి వస్తువులపై వ్రాలు స్వభావము గల ఈగలు మాంసముపై మూగును గాని, ఫలములపై, కూరగాయలపై వాలవు. కావున మాంసము'మురికి వస్తు' వని సిద్ధమగుచున్నది. మాంసము నగ్నిలో వ్రేల్చిన దుర్గంధ ముత్పన్నమగును. కాని ఫలముల నగ్నియందు గాల్చిన లోకులకు సుఖదాయకమగు సుగంధ ముత్పన్నమగును. మానవ శరీరమును వ్యాధిగ్రస్తమొనర్చునట్టి యూరికామ్లము మాంసమునం దధికముగా నుండును. శాఖాహారి ఇట్టి వ్యాధులచే ముక్తుడై యుండును. చేపలు, కోళ్ళు, పందులు మున్నగునవి అతి మురికి వస్తువులను దినుటచే వాని మాంసము అనేక మురికి పరమాణువులతో నిండియుండును. అట్టి మురికి మాంసమును దినువారి ఆరోగ్యము గూడ మురికిగానే యుండును. వారి యాలోచనలు, శరీర మస్తిష్కములు, చెమట, రజో వీర్యములు, సమస్తమును కలుషితములగును. శాఖహారివి పరిశుద్ధముగ నుండును. మాంసాహారుల సంతానము హింసాప్రవృత్తి గలదై మానవత్వ భూషణములగు దయ, క్షమ, నిర్వైర్యము, ప్రేమ, ఈశ్వరభక్తి, సదాచారము వంటి సద్గుణములు అల్పముగా నుండును. కాని హింస, క్రోధము, మోసము, కపటము మున్నగు దుర్గుణములు అధికముగ నుండి పాపమునకు హేతువగు పశుత్వమును ప్రకటించును.

97. ప్ర. హంస: ఈ కాలమున లోకులు గ్రుడ్డు విషయమున ఎంతో ఆసక్తికరముగా ప్రచార మొనర్చుచున్నారు. మీ యభిప్రాయమేమి?

ఉ. 'గ్రుడ్డు' అనగా కోడిపెట్ట, పుంజుల అపక్వ రజో వీర్యములే. పశువుల రజవీర్యములను దినుట మహానీచము గాదా! గ్రుడ్డు ఒక ప్రాణికి జన్మ నిచ్చుట కాధారము. దానిని నాశ మొనర్చుటయును పాపమే. గ్రుడ్డులో నైట్రోజన్, ఫాస్ఫోరిక్ ఆసిడ్, క్రొవ్వు విశేషముగా నుండును. ఇది శరీర తత్త్వమున ఒక విధమగు ఆమ్ల ద్రావకమును బుట్టించి క్లిష్టమగు వ్యాధులను గలిగించును. అందు కార్బోహైడ్రేట్ ఉండదు. సున్నము గూడ చాల తక్కువగ నుండుటచే అది పెద్ద ప్రేవులందు జేరి, దుర్గంధమును బుట్టించి ఆకలిని మందగింప జేయును. గ్రుడ్లయందు 'కొలెస్ట్రాల్' అను నొక పదార్థము గలదు. అది కాలేయమునందు జేరి రక్తవాహినుల సిరలను పెళుసుగా నొనర్చి పిత్తాశయపు రాళ్ళను (మూత్రాశ్మములను) ఉత్పన్నమొనర్చుట వల్ల రక్తపుపోటు (హై బ్లడ్ ప్రెషర్) అధికమగును, గ్రుడ్డులోని తెల్ల సొనయందు 'ఎవిడిన్' అను పేరుగల పదార్థముండి తామర గజ్జివంటి రోగములను గలిగించును. 'కొలెస్ట్రాల్' వల్ల మూత్రపిండముల వ్యాధులు గూడ గలుగును.

గ్రుడ్డు సాక్షాత్తుగ ఒక జీవియొక్క గర్భమే. గర్భపాత మొనర్చి వానిని దినుట మానవత్వమేనా? అతి నికృష్ట కార్యముకాదా! కొందరు గ్రుడ్లను ఫలములని, శాఖాహారముతో సమానమేనని చెప్పుచు లోకులను మోసపుచ్చుట అన్యాయము. మాంసాహార వ్యక్తి మస్తిష్కము క్రోధము, ఈర్ష్య, స్వార్థ భావములతో అసంతులితముగ నుండును.

శాకాహార జీవులు చీకటియందు చూడజాలవు. ఇవి భోజనమును చక్కగ నమిలి మ్రింగును. ఇవి శ్రేష్ఠ గుణముల ధారణ మొనర్చుకొని ఆస్తికత, సభ్యత, విశ్వాసము గలవై యుండును. 'బ్రతుకుము, బ్రతుకనిమ్ము' అను స్వభావము శాకాహార జీవులందు మరియు అట్టి మనుష్యులందే కానవచ్చును. కావున ఏ దృష్టితో చూచినను మనుష్యుడనగా మననశీలుడు, ధర్మాత్ముడు, శ్రేష్ఠప్రాణి, శాకాహారి జీవి యని స్పష్టమగుచున్నది. ఈశ్వరుడు మానవుని శాకాహారిగానే సృష్టించినాడు. కాని మాంసాహారము వల్ల మానవత్వ ధర్మము నుండి స్వయముగనే పతితుడైనాడని తలచవలెను.

మాంసాహార జీవులు ఆహారమును గబగబ మ్రింగివేయును. అవి రాత్రి కారుచీకటియందు కూడ చూడగలవు. వాని సరాసరి ఆయువు చాల తక్కువగా నుండును. అవి ప్రచంఢమైనవిగ ఇంద్రియ లోలత్వము, ధైర్యవిహీనత, ఉత్తేజము మరియు ఆక్రమణ ప్రవృత్తి గలవై యుండును. ఆకలి దహించుకుపోవునప్పుడవి తమ పిల్లలనే తినివేయును.

98. ప్ర. వీణ: శారీరక శక్తులను పెంపొందించు విటమినులు గ్రుడ్ల యందు విరివిగ నుండునని కొంద రనేది వాస్తవమేనా?

ఉ. విటమిన్లు మనుష్యుని మలమునందు అన్నిటికన్న అధికముగ నుండును. దానిని దినిన కోళ్ళు, పందులు ఎఱ్ఱని రక్తము గలవై చక్కగా బలియును. అట్లని మానవ మలము తినదగిన వస్తువగునా? గ్రుడ్లకన్న నధికముగ విటమినులు మనుష్యుని శరీరమున బుట్టుచుండును. మలమునందు, రజో వీర్యములచే నిర్మాణమైన గ్రుడ్లయందు భేద మేమియు నుండదు. గ్రుడ్లు కూడ మలము వలెనే మల ద్వారము నుండి వచ్చినదే. గ్రుడ్లు నందలి తెల్ల సొనను దినుట వల్ల చర్మము వాచుటయే గాక అనేకులకు పక్షవాతము గూడ రాగలదు. ఎందరో గొప్ప డాక్టర్లు అనుభవ పూర్వకముగా 'మానవుడు శాకాహార కోవకు చెందిన ప్రాణి కావున మాంసాహారము చేయవల'దని తెలిపినారు. మాంసాహార మాతని శారీరక, ఆత్మిక, మానసికోన్నతి యందు బాధకముగ నుండి దేవత్వము నుండి పశుత్వ మార్గమునకు గొని పోవును.

99. ప్ర. హంస: మనము ఏ విధమైన మాంసమును గూడ తినవలదా?

ఉ. బిడ్డా! ఏ విధమగు మాంసమైనను మాంసమే కదా. ప్రాణులను చంపి మాంసమును తీసి తినుట మహా పాపమే. ధాన్యములు, వృక్షాదులు, ఫలములు, కందములు (దుంపలు), వ్రేళ్ళు, శాకములు మొదలగునవి సేవించుటయే ధర్మము అగును. మానవ శరీరమున కవసరమగు సమస్త తత్త్వములు శాకాహారము ద్వార లభించును. శాకాహారవర్గ ప్రాణులకు శాకములు, మాంసాహార వర్గ ప్రాణులకు మాంసము సహజాహారమై యుండును.

100. ప్ర. వీణ: మాంసాహార జీవులకు మాంస మేల హానిని గలిగించదు?

వానికి మాంసాహారము వల్ల హత్యాపాప మేల అంటదు?

ఉ. మనుష్యుడు కర్మ, భోగ మను ఉభయ యోనులకు చెందినవాడు. ఈ యోనియం దాతనికి 'పాప పుణ్యములు' అను బంధనముండును. ఈశ్వరుడాతనికి ధర్మాధర్మముల నెరుగు బుద్ధిని గూడ ప్రసాదించాడు. మిగతా యోనులన్నియును కేవలము భోగ యోనులు మాత్రమే. అవి మనుష్య యోనులం దొనర్చిన కర్మఫలము ననుభవించుచుండునని తెలియు చున్నది. వానియందు పాపపుణ్యముల బంధన ముండదు. మాంసాహార వర్గ జీవుల శరీర నిర్మాణము మాంసమును సులభముగ జీర్ణించుకొనునట్లు, దానివల్ల ప్రాణులకు హాని గలుగకుండునట్లు జరిగినది. ఏయే జీవుల కర్మ కారణమున ఏయే జీవుల హత్య జరిగియుండునో అట్టివే ఆ మాంసాహార జీవులకు భోజనమగుట జరుగును. దీనివల్ల ఒక జీవికి దాని కర్మలకు శిక్ష హత్యారూపమున లభించునప్పుడు రెండవదాని క్షుదా నివారణ జరుగును. అందువల్ల దాని పూర్వజన్మ ప్రతీకారము గూడ పూర్తియగును. ఇది పరమేశ్వరుని కర్మఫల వ్యవస్థయై యున్నది.

నాల్గవ దినము–నాల్గవ అధ్యాయము సమాప్తము

# పంచమాధ్యాయము

నేడు డా. లోక శంకర్‌గారింటికి బంధువు లెవ్వరో రానున్న కారణమున మాతా పుత్రికలు పెందలకడనే లేచి నిత్యకృత్యములను గృహ కృత్యములను దీర్చుకొని స్వాధ్యాయ మందిరమున కూర్చున్నారు. అప్పుడు పెద్ద కూతురగు వీణాదేవి తల్లితో 'అమ్మా' నాలుగు దినములనుండి ఎంతో చక్కని కాలక్షేపము జరుగుచున్నది. ఎంతయో కాలమునుండి ఎన్నో శంకలు మమ్ము బాధించుచుండెను. మీరెంతో చక్కని శైలిలో అరటిపండు నొలిచిపెట్టినట్లు మాకు విడమరచి చెప్పుచున్నారు. మా కెంతయో సంతృప్తి గలిగినది. మీ గర్భమున జన్మించి నందుకు మే మెంతో అదృష్టవంతులము. ఇంకా నాలుగైదు శంకలు మాత్రము అడుగవలసి యున్నది. కాని నేడు మీకు వీలుండదు కాబోలు.

సౌ. అన్నపూర్ణాదేవి : బిడ్డలారా! చుట్టా లింకా రాలేదు గదా! మీవంటి పుత్రికలను గన్న తల్లి నగుట నేనునూ అదృష్టవంతురాలినే. మీ శంక లేమియో అడుగుడు. బంధువులు వచ్చేవరకు మాట్లాడుకొనవచ్చును. కాని ఈ విషయములు ఈ చెవితో విని ఆ చెవితో వదలివేసిన లాభముండదు. జీవితమున వీనిని మరువక మనన మొనర్చుకొనుచు ఇంకా తెలియని విషయము లేమైన నున్న నిస్సంకోచముగా పెద్దల నడిగి తెలిసికొనుచు తార్కిక దృష్టితో ఆలోచించుట మంచిది. ఈ కాలమునం దెన్నియో వింతలు, విచిత్రములు జరుగుచున్నవి. బాబాలు, యోగినులు పుట్టగొడుగుల వలె బుట్టుచు పూర్వజన్మఫల లబ్ధ శక్తులచే ప్రజలను మోహింపజేయుచు కుమార్గమున ఉభయ భ్రష్టత్వమును గలిగించుచున్నారు. ఏ శ్రమ లేకుండా సులభ పద్ధతిలో మోక్షము దొరుకునను ఆశతో గొప్పగా చదువుకున్న వారే అధికముగా వీరి జాలమున బడుచున్నారు. ఇట్టి వారిని గాంచిన విద్యావిహీనులు, అల్ప విద్యావంతులు 'అంత గొప్ప డిగ్రీలు గలవారే వారి శిష్యు లైనారు గదా' యని తలచి వీరును ఆ మార్గముననే అవలంభింతురు. ఈ విధముగా తర్కము నవహేళన మొనర్చి వ్యక్తి నిర్మిత మతము లందు బడి రెండు పడవలందు రెండు పాదముల నుంచి ప్రయాణ మొనర్చుచున్నారు. అట్టివారిని గాంచి చలించక ఈశ్వరుడు

ప్రసాదించిన చక్కని బుద్ధితో నాలోచించుడు. గారడీ వింతలను గాంచి మోసపోకుడు. మహాపురుషు డెవ్వడును తమాషాలు చేసి తమ శక్తులను వమ్ము చేసికొనడని నమ్ముడు. ఇక మీ శంక లేమియో అడుగుడు.

101. ప్ర. వీణ: అమ్మా! సారాయి మున్నగు మాదకద్రవ్యముల సేవన వల్ల చురుకుదనము, ఉత్సాహము పెరుగునని లోకులనుచుండుట ఎంతవరకు యథార్థము?

ఉ. సారాయి మనుష్యుని స్వాస్థ్యమును, సదాచారమును నాశన మొనర్చును. ఇది మానవ సమాజమునకు శత్రువు. సారాయి ఒక రకమగు విషము. దీని సేవన వల్ల జీర్ణకోశమున మంట, హృదయ సూక్ష్మనాడులు నష్టమగుట, జీర్ణశక్తి నశించుట, హృదయము ముడుచుకొనుట, మెదడునందు రక్తము పేరుకొని పక్షవాతము వంటి భయంకర వ్యాధులుత్పన్నమగుట. ఆలోచనా శక్తి క్షీణించుట, ఒక్కొక్కప్పుడు పిచ్చితనము గలుగుట కూడ సంభవించును. జీర్ణరసము సిద్ధము గాకుండ మలబద్ధకమును గలిగించును. జీర్ణక్రియ క్షీణించును. మస్తిష్కము ఉత్తేజిత మగును. స్త్రీలయందు రజమును, పురుషులలో వీర్య ధాతువులను పలుచగ నొనర్చి చెరచును. ప్రదర ప్రమేహాది వ్యాధులను గలిగించును. శరీరమును బోలుగ, దుర్బలముగ నొనర్చును. శక్తిని క్షీణింపజేయును. త్రాగుబోతు ఆయువు తగ్గును. అతడు శీతోష్ణములను సహించుకొనజాలడు. త్రాగుడు అలవాటు గలవారి చర్మము మరియు గర్భనాడులు ఉబ్బిపోవును. వారియందు అపరాధము లొనర్చు ప్రవృత్తి జాగృతమగును. సారాయి విషము దాహమును ప్రకోపింప జేసి భయంకరమగు శారీరక, మానసిక వ్యాధులకు గురి జేయును. ఒక్కొక్కప్పుడు ఇట్టి వారికి హృదయ మాగిపోవుటయును జరుగుచుండును. మోటారు వాహనముల దుర్ఘటనలు త్రాగుబోతు (డ్రైవర్ల) మూలముననే జరుగుచుండును. సభ్యత గల భారతీయ సమాజమున త్రాగుబోతు నీచ దృష్టితో చూడబడును. సమస్త వైదిక ధర్మ శాస్త్రములందు సారాయి నిందనీయమగు, రాక్షసాహారముగ నెంచబడినది. మహాపురుషులెల్లరును నిందనీయమగు నీ మద్యపానమును స్పర్శించ కూడదనియే ఉపదేశించినారు.

ఏ దృష్టితో జూచినను సారాయి అత్యంత హానికరము. స్త్రీలకు మహాఘాతుకమై

యున్నవి. త్రాగుబోతు తన ధన సంపత్తులను, కుటుంబ సౌఖ్యములను నాశ మొనర్చును. మాదకద్రవ్య సేవనము, జూదరి తనము నుండి స్వయముగ తప్పుకొనియుండి తను సంతానమును ఈ యవస్థ నుండి తప్పించుట ఎంతయో అవసరము. మద్యమాంసముల సేవన వల్ల మానవుడు నరపశువుగ మారిపోయి ఇంటా బయట నిరాదరణ దృష్టితో జూడబడును. ఎట్టి మాదక ద్రవ్యములైనను బుద్ధి, ఆరోగ్యము, ఆయువు, కీర్తిని నశింపజేయును. కావున వీనినుండి యెల్లరును తప్పుకొని యుండుట శ్రేయస్కరము.

103. ప్ర. హంస: అమ్మా! వర్ణ వ్యవస్థలను జన్మతో నమ్మవలెనా? లేక గుణకర్మ స్వభావములతోనా?

ఉ. వర్ణ వ్యవస్థలను గుణకర్మ స్వభావముల యాధారముపై నమ్మవలసి యుండును. నాలుగు వర్ణములు :

1. బ్రాహ్మణులు:

"అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా ।
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానా మకల్పయత్ ॥"

–మనుస్మృతి 1-88

'చదువుట, చదివించుట; యజ్ఞము చేయుట, చేయించుట; దానమిచ్చుట పుచ్చుకొనుట అను నీ యారు బ్రాహ్మణుని కర్మలు' చక్కని ధార్మిక ప్రవృత్తి గలవారు, స్వాధ్యాయము విద్యాధ్యయనమున రుచి గలవారు, పవిత్ర జీవనము గలవారు, సత్యవాదులు, సత్కర్మపరులు, పరోపకారులు, యజ్ఞాది శుభకర్మల చేయుచు, చేయించువారు, విద్యాదానము నొనర్చువారు, వేదాధ్యయనము చేయువారు, శాస్త్రవిద్వాంసులు, సమాజమును శాస్త్రానుకూలముగా నడుపువారు, ఉపదేష్టలు బ్రాహ్మణులుగ నెంచబడుదురు.

2. క్షత్రియులు:

"ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ ।
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః ॥"

-మనుస్మృతి 1-89

న్యాయముగ ప్రజలను రక్షించుట, శ్రేష్ఠులను సత్కరించుట, దుష్టులను శిక్షించుట, విద్య ధర్మములందు ధనము మున్నగు పదార్థములను వ్యయపరచుట, యజ్ఞాదులను చేయుట, చేయించుట; వేదాది శాస్త్రములను చదువుట, చదివించుట, విషయములందు దగులు కొనక జితేంద్రియుడై సదా శరీరమును, ఆత్మను బలిష్టముగ నుంచుకొనుట క్షత్రియ ధర్మము.

స్వభావ సిద్ధముగ క్షాత్ర ధర్మమున రుచి గలవారు, శూరవీరులు అస్త్ర శస్త్ర విద్య నభ్యసించువారు, బలిష్ఠులు, లేక రక్షణమున శ్రద్ధ గలవారు, సదాచారులు, దీన రక్షకులు, విద్వాంసులు నగు వారు క్షత్రియులు.

3. వైశ్యులు :

"పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ ।
వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషిమేవ చ ॥"

-మనుస్మృతి 1-90

గోవులు మొదలగు పశువుల పోషణయందు, విద్యా ధర్మములందు, యజ్ఞకర్మలందు, వేదాది విద్యల అభివృద్ధి యందు ధనమును వ్యయపరచుట; వేదాధ్యయనము, యజ్ఞములను చేయుట, చేయించుట కృషి వ్యాపారములం దభిరుచి, అర్థోపార్జన, పదార్థముల ఉత్పత్తి, వితరణ మున్నగు వ్యవస్థల నొనర్చుచు దాన ధర్మములను క్రమముగ నొనర్చుచుండు సభ్యులు, విద్వజ్జనులు నగువారు వైశ్యులు.

4. శూద్రులు :

"ఏకమేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్ ।
ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా ॥ "

-మనుస్మృతి 1-91

ప్రయత్నము జేసియును పై మూడు వర్ణముల వారివలె వేదాధ్యయన మొనర్చజాలని వారు నింద, ఈర్ష్య, అభిమానాది దోషములను వదిలి యథాశక్తి

ఉపరోక్త మూడు వర్ణముల వారి సేవ యొనర్చుటకు యోగ్యులైన వారు శూద్రులుగ నెంచబడుదురు.

వర్ణ వ్యవస్థయందు రజోవీర్యముల, తల్లిదండ్రుల మరియు వంశ సంస్కారముల ప్రభావము గూడ ముఖ్యమై యుండును. ఈ విషయము లన్నిటిని చక్కగ పరిశీలించిన తరువాతనే రాజ్యపరముగ ఆచార్య వర్గము ద్వారా వర్ణవ్యవస్థ నిశ్చయించబడును. ఏ వ్యక్తియైన తన గుణకర్మ స్వభావములతో తనను పైతృక వర్ణమునకు తగని వానిగనో, పై వర్ణమున కధికారిగనో నిరూపించుకొనినచో ఉపరోక్తాధారములపై ఆతని వర్ణమును మార్పు చేయుటయు, ఏ వర్ణమునకు అర్హుడు, యోగ్యుడు నగునో దానియందే ప్రవేశింపజేయుటయు ప్రాచీన మర్యాదయై యుండెను.

103. ప్ర. హంస: ప్రపంచమున భూకంపము లేల గలుగుచుండును?

ఉ. భూమిలో అడుగు భాగమున అతి వేడిమి మున్నగు కారణములచే ఏ భూభాగ మందైనను ఏదైన తారుమారు జరిగినప్పుడు భూమి పై భాగమున భూకంపనలు జరుగుచుండును.

104. ప్ర. వీణ: 'ఆర్య' శబ్దమున కర్థ మేమి?

ఉ. **'శాంతస్థితిక్షు ర్దాన్తః సత్యవాదీ జితేన్ద్రియః ।**
**దాతాదయాళుర్నమ్రశ్చ ఆర్యస్యాదష్టభిర్గుణైః ॥"**

–మహాభారతం

ఆర్య శబ్దమునకు 'శ్రేష్ఠుడు, ఆచరణశీలుడు, ఉత్సాహవంతుడు, పరోపకారి, ఈశ్వరవిశ్వాసి, వైదికధర్మి, ఆర్యవంశీయుడు, సత్యభాషి, సాత్వికాహారి, భూతదయ, పవిత్ర ఆశయములు మున్నగు శ్రేష్ఠ గుణములు గలవాడని అర్థము.

105. ప్ర. హంస: 'ఆర్య సమాజ' నిర్వచన మేమి?

ఉ. ఆర్య సమాజ మనగా శ్రేష్ఠ పురుషుల సమాజము. మహర్షి దయానంద సరస్వతి ద్వారా పరోపకారార్థము వైదిక ధర్మ ప్రచార మొనర్చుట కేర్పర్చబడిన సంస్థ. ఇది 'ఆర్యసమాజ' మను నామముతో ప్రసిద్ధమై యున్నది. దీని శాఖలు

భారతదేశ మందే గాక విదేశము లందును వేల సంఖ్యలో నెలకొల్పబడి యున్నవి. ఇది విశ్వప్రసిద్ధ సంగతనము.

106. ప్ర. హంస: పూర్వులు అజామేధ, గోమేధ, అశ్వనరమేధములను యజ్ఞములను చేయుచుండెడివారట. వానియందు మేకలు, ఆవులు, గుఱ్ఱములు, మనుష్యులు చంపబడుచుండెడివట నిజమేనా?

ఉ. కాదు బిడ్డా! 'గోమేధ యజ్ఞ'మున కర్థము పృథివిపై కృషి యొనర్చుట, ఇంద్రియములను జయించుట. 'గౌ' శబ్దమునకు పృథివి, సూర్యుడు, కిరణములు, ఇంద్రియములు అని యర్థము. 'అశ్వమేధము'న కర్థము పెద్ద ఎత్తున ఘృత సామగ్రులతో లోక కల్యాణార్థము విశాల యజ్ఞ మొనర్చుట. 'నరమేధ' మున కర్థము శవమును దాహ సంస్కార (కర్మ) ము నొనర్చుట. అసలు 'యజ్ఞ' మనగా అహింసాయుతము, లోకోపకార కార్యమని అర్థము. హింసామయ కార్యము లేవియైనను 'యజ్ఞము' లనబడవు. నామమార్గీయుల వల్ల లోకులు తప్పు అర్థము చేసికొనుట జరిగినది.

107. ప్ర. వీణ: అమ్మా! భారతదేశ ప్రాచీన పద్ధతియందు మన ఋషులు, మునులు, గురుజనము మరియు నేటి కాలమందును కొందరు పెద్దలు జీవించదలచిన వారి తలపై హస్తము నుంచి ఆశీర్వాదము నేల యిత్తురు? దూరము నుండి శబ్దము ద్వారా దీవించుట చాలదా?

ఉ. బిడ్డా! దూరము నుండి ఆశీస్సు లిచ్చుటకన్న తలపై చేయినుంచి ఆశీర్వదించుటయే ఉపయుక్తము. ఆశీర్వదించు ఋషి, ముని, గురుజనముల హార్దిక ప్రసన్నత మరియు ఆశీస్సులను పొందదలచిన ప్రతి వ్యక్తి పవిత్ర కామితములను ఆశీర్వదించు వారి పవిత్ర భావనలు, మనోశక్తులు వారి హస్తాంగుళీయాగ్ర భాగముల ద్వారా ప్రవహించి ఆశీర్వాదము పొందువారి మస్తిష్కమున ప్రవేశించును. దాని ప్రభావము వల్ల వారి బుద్ధి మరియు శక్తులు వికసించి ఆయురారోగ్యములు, శక్తి సామర్థ్యములు, విద్యాబుద్ధులు వృద్ధియై ఆశీస్సులు సఫల మగును. దూరము నుండి ఆశీర్వదించుటలో ఈ మనో వైజ్ఞానిక లాభము లంతగా నుండవు. మన పూర్వు లీ రహస్యమును చక్కగా

నెరిగియుండిరి. కావున వారు శిరముపై తమ పవిత్ర వరద హస్తముల నుంచియే ఆశీర్వదించుచుండిరి.

108. ప్ర. హంస: అమ్మా! నా స్నేహితురాలు ఎగ్జిమా (గుండుగుత్త వ్యాధి-(కురుపులు లేచి నీరు కారుచుండు ఒక విధమగు చర్మ వికార వ్యాధి) తో బాధపడుచున్నది. పాప మామె కడు చింతలో నున్నది. నే నామెను చూచుటకు వెళ్ళెదను. నేటి సత్సంగ మింతటితో చాలింతము.

ఉ. అన్నపూర్ణ : ఈ వ్యాధికి ఇంగ్లీషు (అలోపతి) వైద్యములో సరియగు చికిత్స లేదు. నే నొక చికిత్స చెప్పుదును. దానివల్ల నీ మిత్రురాలి వ్యాధి శీఘ్రముగా, సంపూర్ణముగా తగ్గిపోగలదు. ఒక గాజు లేక పింగాణి పాత్రలో 50 గ్రాముల ఆవనూనె, 50 గ్రాముల చక్కని చిక్కని పెరుగు వేసి నాల్గు దినముల వరకు దినమునకు మూడుసార్లు వ్రేలితో చక్కగా కలుపుచుండవలెను. ఐదవ నాటినుండి దినమునకు మూడుసార్లు ఎగ్జిమా పై లేపనము చేయుచుండవలెను. 5,6 దినములలో ఆ వ్యాధి పూర్తిగా తగ్గిపోగలదు.

మరొక చికిత్స : తుత్తాంజనము అనగా మైలతుత్త భస్మము 5 గ్రాములు, కర్పూరము (క్యాంఫర్)10 గ్రా, కురాసానివాము(ఓమము) 10 గ్రా, గొట్టాల గంధకము 10 గ్రా. పై నాలుగు వస్తువులు వేర్వేరుగ మర్దించుకొని 50 గ్రా. మంచి మల్లె నూనెలో కలుపుకొని పూసికొనుచుండిన వ్యాధి పూర్తిగ తొలగి పోగలదు.

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

ప్రియ మాతలారా! సోదరీ మణులారా!

ఈ 'మాతా పుత్రికల జ్ఞాన చర్చ' చదివిన మీకు వైదిక సిద్ధాంతాల పరిచయం కొంత కలిగియుండును. వైదిక ధర్మమున స్త్రీలకు మహోన్నత స్థానం గలదు. క్రైస్తవ, మహమ్మదీయ మత గ్రంథాలలో స్త్రీ ఒక భోగ్య వస్తువుగా, సంతానాన్ని కనుటకు, ఊడిగములు చేయుటకు మాత్రమే పరిమితము. కానీ, వేదం స్త్రీని గృహ సామ్రాజ్ఞినిగా చేయును. జాతిని నడిపించు నాయకిగా, మార్గదర్శిగా 'అహం కేతు రహం మూర్ధా' (ఋ. 10-159-2) అని గర్వించమనును.

"మమ పుత్రాః శత్రుహణోఽథో మే దుహితా విరాట్ ।
ఉతాహమస్మి సఞ్జయ పత్యౌ మే శ్లోక ఉత్తమః ॥"

(ఋ. 10-159-3)

నా పుత్రులు శత్రు మర్దనులు. నా పుత్రికలు విశ్వపూజితలు. నేను సర్వ విజేతను. నా పతి హృదయమున ఉత్తమ యశస్వినినై యున్నాను' అని ఎలుగెత్తి చాటుమనును.

ఓ మాతృ మూర్తులారా! ఇప్పటికిని వేష భూషలలో, సభ్యతా సంస్కృతులలో భారతీయతను మీరే కాపాడుచున్నారు. కాన, పాశ్చాత్య సభ్యతా సంస్కృతీ భాషా భావ సుడిగుండాలలో చిక్కుకున్న నేటి ఈ భారత జాతిని సంస్కరించ మీరే ముందుకు రావలెను. గాన మాతలారా!

'ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్ నిబోధత'

లెండు ! మేల్కొనుడు ! మహర్షి దయానంద ప్రదర్శిత వేద జ్ఞానము నాశ్రయించి ఈ జాతి నుద్ధరింపుడు.

– సుమ్నార్థి (సంపాదకుడు)

Gayatri Series : 19

**MAATA PUTRIKALA GNANA CHERCHA**

Rs. 60/-

## మాతా పితల దివ్యస్మృతిలో



కీ॥శే॥ శ్రీమతి గుండాల ఎల్లమ్మ గారు
మరణం : క్రీ.శ. 1992
(జీవితం 86 సం॥లు)



కీ॥శే॥ శ్రీ గుండాల చంద్ర
మరణం : క్రీ.శ. 196
(జీవితం 73 సం॥లు)

కుమారులు :

శ్రీ రామారావు గారు (80 సం॥లు)

శ్రీ శ్రీపతిరావు గారు (69 సం॥లు)

శ్రీ రఘుపతిరావు గారు (66 సం॥లు)

కీ.శే. శ్రీ దామోదరరావు (74 సం॥లు) గారి స్మృతిలో

వీరి దత్తపుత్రుడు శ్రీ సురేంద్రరావు గారు


Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj - Vyas Nagar, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061.
(Secretary : SRI K.P. NARSING RAO, Cell : 98480 11073)

PRINTSHOP - 040-66326330